ఓమ్

శ్రీ మహర్షి మలయాళ సద్గురు పరబ్రహ్మణేనమః

# ఆచరణ - అనుభవము





గ్రంథకర్త :

శ్రీ చిన్మయ రామదాసు

# విషయసూచిక

## ఆచరణ విభాగము

## అనుభవ విభాగము

## విరక్త్యాశ్రమధర్మ విభాగము



## వైరాగ్యాది ధర్మ పద్యములు

# బాగుపడే వర్తనలు - చెడిపోయే వర్తనలు

అడిగినవారికి శక్తికొలది దానము చేయుము. సేవ చేయుము. బాగుపడెదవు. ఇతరుల నడిగితివా, సేవచేయించు కొంటివా, చెడిపోయెదవు.

'ఇతరులు నీ ఒక చెంపను కొట్టిన రెండవ చెంపనుగూడ నిమ్ము' యని క్రీస్తుదేవుడు చెప్పినట్లు నడచితివా, బాగుపడెదవు. కొట్టినవారిని తిరిగి కొట్టితివా, తిట్టినవారిని తిరిగి తిట్టితివా, చెడిపోయెదవు.

ఇతరులు నీకు అపకారములు చేసినను నీవు ఉపకారములు చేసితివా, బాగుపడెదవు. ఉపకారులకుగాని, అపకారులకు గాని హింస గలిగించితివా, చెడిపోయెదవు.

నీ కంటిలో గల దూలమును మరచి ఇతరుల కంటిలో గల నలుసును వెదకెద వేల? యని ఏసుప్రభువు చెప్పినట్లుగా నీలో గల తప్పులను గుర్తించి పారద్రోలితివా, బాగుపడెదవు. పరుల తప్పులను వెదకుచు కాలము గడిపితివా, చెడిపోదువు.

అయ్యా! అమ్మా! సోదరా! సోదరీ! యని ఇతరులను పిలచుచు నిష్కపటముతో వర్తించితివా, బాగుపడెదవు. అరే! ఒరే! ఒసే! యనుచు గర్వముతో వర్తించితివా, చెడిపోదువు.

శివ, రామ, కృష్ణ, గోవింద, నారాయణ యనుకొనుచు ప్రవర్తించితివా, బాగుపడెదవు. వ్యర్థమైన లోకవార్తలతో వ్యర్థమైన క్రియలతో కాలమును గడుపుచుంటివా, చెడి పోయెదవు.

పెద్దలను, పెద్దలుచెప్పిన ధర్మములను ఆధారముగా జేసికొని లోకభ్రాంతులను వదలితివా, బాగుపడెదవు. లోక (దేహ) సౌఖ్యములకు లోబడి సత్య ధర్మ వర్తనలను వదలితివా, చెడిపోయెదవు.

పుట్టిన గుణముల (సంకల్పముల) వెంట శరీరమును వాక్కును పోనీయక పరమాత్మసుఖప్రాప్తికై పాటుపడు చుంటివా, బాగుపడెదవు. శరీరమును, వాక్కును, మనస్సును సన్మార్గమున నడిపించక (స్వాధీనమం దుంచుకొనక) యుంటివా, చెడిపోయెదవు.

సర్వము దేవునిదిగా సంభావించుచు దాసుని (సేవకుని) వలె వర్తించితివా, బాగుపడెదవు. అహం మమతలతో, స్వార్థ గుణముతో వర్తించితివా, చెడిపోయెదవు.

మన కర్మానుసారముగా భగవంతుడు మనకు సుఖ దుఃఖ లాభ నష్టాదులను కలుగజేయుచున్నా డనుకొంటివా, బాగు పడెదవు. శత్రు మిత్రాదులవలన, కలిమి లేములవలనను, సుఖ దుఃఖ, స్తుతి నిందాదులు వచ్చుచున్నవని తలంచి రాగ ద్వేషాది గుణములతో ప్రవర్తించితివా, చెడిపోయెదవు.

దేహము మానసికవికారగుణములున్న నేను యని తలంచుకొనుచుంటివా, చెడిపోయెదవు. నిర్వికల్ప నిర్వికార నిత్యానందస్వరూప పరమాత్మయే నేను యని సంభావించు చుంటివా, బాగుపడెదవు,

ఇతరులయొక్క దేహసౌందర్య విద్యా ధన కులముల జూచి ప్రేమతో నుంటివా, చెడిపోయెదవు. ఇతరులలో గల మంచిగుణములను, పరమాత్మ స్వరూపమును చూచుచు ప్రేమతో నుంటివా, బాగుపడెదవు. ఓమ్

ఓమ్

# ప్రార్థనా శ్లోకములు

( శ్రీ గణేశ స్తవము )

శ్లో॥ ప్రణమ్య శిరసాదేవం। గౌరీపుత్రం వినాయకమ్
భక్త్యావా సంస్మరే నిత్య। మాయుష్కామార్థ సిద్ధయే॥

( శ్రీ సరస్వతీ స్తవము )

శ్లో॥ నమస్తే శారదాదేవి। జ్ఞానైశ్వర్య ప్రదాయినీ
నిత్యానందమయీ వాణి। పాహిమాం భక్తరక్షిణీ॥

( శ్రీ మలయాళ సద్గురు స్తవము )

శ్లో॥ మల్యాళస్వామిదేవాయ। మహనీయగుణాత్మనే
అసంగానంద రూపాయ। అనంతాయ నమోనమః॥

( శ్రీ ఆంజనేయ స్తవము )

శ్లో॥ మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాంవరిష్ఠమ్
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శరణంప్రపద్యే॥

## ( శ్రీ విష్ణు స్తవము )

శ్లో॥ శంఖచక్రగదాపాణే । ద్వారకానిలయాచ్యుత
గోవింద పుండరీకాక్ష । రక్షమాం శరణాగతమ్ ॥

## ( ఈశ్వర స్తవము )

శ్లో॥ మృత్యుంజయాయ రుద్రాయ । నీలకంఠాయ శంభవే
అమృతేశాయ శర్వాయ । శ్రీ మహాదేవతేనమః ॥

## ( నవగ్రహ స్తవము )

శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ । మంగళాయ బుధాయచ
గురుశుక్ర శనిభ్యశ్చ । రాహవే కేతవేనమః ॥



ఓమ్

శ్రీమహర్షి మలయాళ సద్గురు పరబ్రహ్మణేనమః

# ఆచరణ - అనుభవము

(ఆచరణ విభాగము)

శ్లో. నానుష్ఠానా త్పరం కార్యం । త్రిషులోకేషు విద్యతే
సత్యం సత్యం పున స్సత్య । మితి మామక భాషితమ్.

తా. మూడులోకములందును ఆచరణకు మించిన కార్యము మరియొకటి లేదు. ఇది సత్యము ఇది సత్యము ఇది సత్యము. ఇదియే నాయొక్క (శ్రీమలయాళ సద్గురుస్వాములవారి) ఆశయము.

లోకములో అనేకులు మంచిచెడ్డలను, జ్ఞానాజ్ఞానములను, నిత్యానిత్యములను, సుఖదుఃఖకారణములను చూచుచు, వినుచు, చదువుచు, అనుభవించుచు చెడ్డను, అజ్ఞానమును, అనిత్యమును, దుఃఖమును వదలిపెట్టకనే యున్నారు. ఇదియే ఆచరణలేని ఫలితము.

చదువు లేకపోయినను పెద్దలద్వారా భక్తి జ్ఞాన వైరాగ్యాది ధర్మములను తెలిసికొని ఆచరించువారే ముక్తులు (బ్రహ్మజ్ఞానులు) అగుదురు.

శ్రీశుకమహర్షి, మహమ్మదు, కబీరుదాసు, ఏసుక్రీస్తు, గురునానక్కు, శ్రీరామకృష్ణపరమహంస, శబరి, కన్నప్ప మొదలైనవారెందరో చదువులేకనే ఆచరణద్వారా ముక్తులైరి.

శ్రీ బుద్ధుడుకూడా వేదములను చదువకపోయినను వేదధర్మా చరణచే నిర్వాణపదము నొందిరి.

శ్లో. స్వానుష్ఠానపరో నిత్య। మనిచ్ఛన్నపి ముచ్యతే।
స్వానుష్ఠానేన రహితః। ఇచ్ఛన్నపి నముచ్యతే॥

తా. మోక్షమార్గములగు కర్మయోగ, భక్తియోగ, ధ్యాన యోగ, జ్ఞానయోగములలో తనకు యిష్టమైన యోగమును (ధర్మమును) తప్పక నడచుచున్నచో మోక్షము నొందవలెనను కోరిక లేకపోయినను ముక్తిపదము లభించును. యోగధర్మమును అనుష్ఠించక మోక్ష మొందవలెనని ఎంతకాలము కోరినను మోక్ష సుఖము దొరుకదు.

శ్లో. అజ్ఞేభ్యో గ్రంథినః శ్రేష్టః। గ్రంథిభ్యో ధారిణో వరా।
ధారిభ్యో జ్ఞానినః శ్రేష్ఠా। జ్ఞానిభ్యో వ్యవసాయినః॥

తా. బొత్తిగా చదువులేనివారికంటె కొంత చదువుగల వారు శ్రేష్ఠులు. చదువుకొన్నవారికంటె గ్రంథములలో గల ధర్మములను (చదివిన ధర్మములను) గుర్తులో నుంచుకొన్న వారు శ్రేష్ఠులు. ధర్మములను గుర్తులో నుంచుకొన్నవారి కంటె కర్తవ్యాకర్తవ్య, నిత్యానిత్య, ఆత్మానాత్మ వివేకములు గలవారు శ్రేష్ఠులు. వట్టి వివేకజ్ఞానముగలవారికంటె మనోవాక్కాయములతో ఆచరించువారు శ్రేష్ఠు లనబడుదురు. ఆచరించువారికే అనుభవము గల్గునుగదా.

మోక్షమార్గస్థులలో కుంటివా రెవరు? గుడ్డివా రెవరు?

శ్లో. హతంజ్ఞానం క్రియాహీనం, హతా స్త్వజ్ఞానతః క్రియాః।
అపశ్య న్నంధకో దగ్ధః। పశ్య న్నపి చ పంగుకః॥

తా. ఆచరణలేని జ్ఞానము నశించును. జ్ఞానములేని ఆచరణయున్ను మోక్షఫలము నివ్వదు. కుంటివాడు, గ్రుడ్డి వాడును గల గృహము అగ్నిచే తగులబడుచున్నపుడు కుంటివాడు నడిచి బైటకు రాలేకయు, గ్రుడ్డివాడు దగ్ధముచేయుచున్న అగ్నిని చూడలేకయును ఇరువురు భస్మమగుదురుగదా !

లోకములో కొందరు నీతి ధర్మానుష్ఠాన పరులుగా నుండియు ఆత్మానాత్మ వివేకజ్ఞానములేనివారై అహం మమతలను త్యజించలేక అశాంతి నొందుచున్నారు. మరికొందరు ఆత్మా నాత్మవివేకజ్ఞానము కలిగియుండియు అహింస, సత్యము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, త్యాగము, శాంతమున్ను లేనివారై మల విక్షేపఆవరణదోషములను రహిత మొనర్చుకొనజాలనివారై అశాంతితోనే మూల్గుచు బాధపడుచున్నారు. బ్రహ్మజ్ఞాననిష్ఠ, ధర్మాచరణ యను రెండును గలవారుమాత్రమే తాపత్రయాగ్ని నుండి బయటపడగలరు. దగ్ధమగుచున్న గృహమునుండి కాళ్ళు కన్నులు గలవాడే బయటకు వచ్చి సురక్షితముగా నుండగల్గునుగదా !

"సంతి శాస్త్రవిదోఽశీలాః । సంతి మూర్ఖా స్సుశీలినః ॥"

లోకములో కొందరు శాస్త్రజ్ఞానము గలిగియుండియు దుష్టవర్తన గలవారు కలరు. మరికొందరు శాస్త్రజ్ఞానము బొత్తిగా లేనివారైయుండియు భక్తి జ్ఞాన వైరాగ్యాది సద్గుణము లన్నియు గలవారు కనబడుచున్నారుగదా !

శ్లో. జ్ఞానం ప్రధానం నతు కర్మహీనం
కర్మప్రధానం నతు బుద్ధిహీనం

తస్మాదుభాభ్యాం తు భవేత్ప్రసిద్ధిః
నహ్యేకపక్షో విహగః ప్రయాతి॥

తా. జ్ఞానము ప్రధానమేగాని కర్మ (ధర్మాచరణ) లేని జ్ఞానము నిరుపయోగమగును. కర్మ (ధర్మాచరణ) ప్రధానమైనదేకాని జ్ఞానములేని కర్మ నిరుపయోగమగును. కనుక మోక్షసుఖము నొందదలంచువారికి జ్ఞానము (అనగా పరమాత్మ నిష్ట) కర్మ (అనగా సత్య ధర్మాచరణము) రెండును తప్పక యుండవలయును. పక్షి ఒకే రెక్కతో ఎగురలేదుగదా! అట్లే ఒక్క ఆత్మానాత్మవిచారణతో (జ్ఞానముతో) మోక్షమునొంద జాలరు. ఒక్క కర్మయోగముతో మోక్షము నొందలేరు.

## దుఃఖనివృత్త్యుపాయము జ్ఞానాచరణమే

ఒక వివేకి దుఃఖములను వర్ణించుకొనుచు చెప్పుకొనుట— స్వామీ, నేను ఇంతవరకు నా జీవితమును పశువుగా గడిపితిని. ఇప్పుడు కండ్లు తెరచి పరికించుచున్నాను. ఇప్పుడు ఈలోకమును, ఈ సంసారమును, ఈ దేహమును, ఈ మానసికవికారములను చూచుచు, తలంచుకొనుచు, వర్ణించుకొనుచూ యున్నకొలది నాకు దుఃఖము పైకి ఉబుకుచున్నది. భరించలేక యున్నాను. మహాత్మా! ఏదేవుని అనుగ్రహముచే ఏమహాత్ముని కృపచే ఏ సుకృతకర్మచే ఏస్థలమున నివసించుటచే నా యీ దుఃఖము నశించునో తెలియుటలేదు.

ఉత్తరము: ఓ పుణ్యాత్మా, ఓ వివేకీ, నీకు గల దుఃఖము లేవో చెప్పుము. మహాత్ములందరును, పరమభక్తులందరును, దుఃఖములను గనుగొని, దుఃఖకారణములను గుర్తించి, దుఃఖనివృత్త్యు

పాయములను కనిపెట్టి, రాత్రింబవళ్లను తీవ్రముగా కృషిచేసి (తపస్సుచేసి) దుఃఖములను దాటి పరమానందము నొందిరి గదా!

వివేకి: స్వామీ, గర్భములోనుండుట దుఃఖము, జన్మించుట దుఃఖము, పెరుగుటలో బాధలు, విద్యాభ్యాసములో కష్టములు, సంసారములో ప్రవేశించినతరువాత తల్లిదండ్రులను, భార్యాబిడ్డలను పోషించుటలో బాధలు, శత్రువులతో సంకటములు, పాము, తేలు, పులి, దొంగలు మొదలగు ప్రాణులచే బాధలు, రోగములచే దుఃఖములు, కామక్రోధాది గుణములచే క్లేశములు, పిడుగులు, గాలి, వాన, ఎండ, జలము, అగ్ని మొదలగు దేవతా సంబంధముచే భయములు, ముసలితనముచే బాధలు, మాట వినని భార్యాబిడ్డలచే సంకటములు, యిన్నిబాధలను నేను వర్ణించుకొనునపుడు నాగుండె బద్దలగునా యని మిక్కిలి భీతియు, దుఃఖమును కలుగుటయేగాక ప్రాణము పోవునేమో యను సందేహముకూడ కలుగుచుండును. ఇక నాజీవితములో శాంతి నెట్లుపొందగలనో నా కేమియు తోచుటలేదు. దయయుంచి ఆత్మశాంతి కలిగే ఉపాయములను దయచేయుడని ప్రార్థించుచున్నాను.

ఉత్తరము: సోదరా! భయపడకుము. దుఃఖపడకుము. గాబరాబడకుము. నిరాశ జెందకుము. దుఃఖములు పోవు మార్గములు కలవు. శాశ్వతశాంతిని పొందు ఉపాయములు (సాధనలు) కలవు. నీవు పొరపాటున విచారణచేయక తికమకలు పడుచు దుఃఖపడుచున్నావు—నీవు ప్రతిదినమును నిద్రలోనున్నప్పుడు సుఖ మెట్లుపొందుచున్నావో గుర్తునకు

తెచ్చుకొనుము. పరమభక్తులు, వైరాగ్యసంపన్నులు, ఆత్మ జ్ఞానులు ఎల్లప్పుడును పరమానందముతో, బ్రహ్మానందముతో నుండుటకు కారణమేమో విచారణ చేయుచుండుము.

దేహామున్నచోట, కోరికలున్నచోట, మమకారము లున్న చోట, క్రోధమున్నచోట, భయమున్నచోట దుఃఖములు కలవని తెలియుచున్నదిగదా. నీవు నిద్రించియున్నప్పుడు పై జెప్ప బడిన దేహాదులు గోచరించుటలేదుగదా. ఇట్లే జాగ్రదవస్థలో (ఇంద్రియములు విషయములను గ్రహించునప్పుడు) కూడ పరమ భక్తులవలె, వైరాగ్యవంతులవలె, బ్రహ్మజ్ఞానులవలె దేహాభిమాన మును, నావి, నావారు యను మమకారమునువదలి తెలివియందే, ఆత్మయందే, బ్రహ్మమందే, దైవమునందే యున్నచో నీకును బ్రహ్మానందము, అతిశయసుఖము కలుగును.

దుఃఖములన్నిటికిని మొదటికారణము నీ దేహామును గుర్తులో నుంచుకొనుట. నాది, నావారు యను మమకారము రెండవ కారణము. యిది కావలెను, అది కావలెను యను కోరికలు మూడవ కారణము. వీరు సుఖపెట్టిరి, వారు బాధపెట్టిరి, ఇది వచ్చినది, అది రాలేదు, ఇష్టమైనవి పోయినవి, అయిష్టమైనవి వచ్చినవి యను తలంపులు (రాగద్వేషములు) దుఃఖము కల్గుటకు నాలుగవ కారణ మగును.

సజ్జనసహవాసముద్వారా, సద్గ్రంథపఠనద్వారా, భగవత్పూజ, పెద్దలసేవలద్వారా, భగవన్నామసంకీర్తనలద్వారా జప స్మరణ ధ్యానములు జేయుటద్వారా, నిత్యానిత్య, ఆత్మా నాత్మ వస్తువిచారణద్వారా, ఎడతెగని పరమాత్మదృష్టి, నిర్వికల్పనిష్ఠలద్వారా క్రమక్రమముగా దారేషణ, ధనేషణ,

పుత్రేషణలను, లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసనలను సత్త్వరజస్తమోగుణములను దాటిన (అతిక్రమించిన) మాత్రమే దుఃఖనివృత్తి, పరమానందప్రాప్తియు సిద్ధించును. కనుక ఈ రోజునుండియే శ్రద్ధవహించి ఆత్మవిశ్వాసము, మార్గవిశ్వాసము, దైవవిశ్వాసములను విడువక ప్రయత్నించుచుండుము. ఇకనుండి చెప్పబోవు విషయములను చక్కగా గ్రహించి ఆచరించుచు అనుభవమునకు తెచ్చుకొనుచుండుము.

## ఆవేదన ఆచరణకు బలమిచ్చు ననుట

అవేదనయే, ఆచరించమని పురిగొల్పును. ఆకలిబాధ అన్నమును సంపాదించుమని పురిగొల్పును. దరిద్రబాధ ధనమును సంపాదించుమని పురిగొల్పును. రోగబాధ ఔషధమును సేవించుమని పురిగొల్పును. చలిబాధ వస్త్రమును కప్పుకొనుమని పురిగొల్పును. కామబాధ మిధునముచేయుమని పురిగొల్పును. క్రోధబాధ తిట్టుమని, కొట్టుమని, చంపుమని పురిగొల్పును. ఇట్లే

అజ్ఞానబాధ జ్ఞానమును సంపాదించుకొనుమని పురిగొల్పును. అశాంతిబాధ మనస్సును నిగ్రహించమని పురిగొల్పును. భగవద్విరహబాధ భగవంతుని భజించమని పురిగొల్పును. మోహబాధ వైరాగ్యమును సంపాదించుకొనుమని పురిగొల్పును. సంగబాధ నిస్సంగివి కమ్మని పురిగొల్పును. అభిమానబాధ నిరభిమానివి ( నిరహంకారివి ) కమ్మని పురిగొల్పును. భేదభావములచే కల్గు బాధ సమత్వదృష్టిని సంపాదించుకొనుమని పురిగొల్పును.

నాలోగల అజ్ఞానము నశించలేదే. నాలోగల కామ క్రోధములు క్షయించలేదే. అనిత్యమైన దేహదృష్టి నశించి ఆత్మదృష్టి కలుగలేదే. సంకల్పములు నశించి నిర్వికల్పసమాధి సిద్ధించలేదే. మమకారము నశించి నిర్మోహత్వము కలుగలేదే. భేదబుద్ధి నశించి అభేదదృష్టి కలుగలేదే.

ఎన్ని బాధలు వచ్చినను ప్రహ్లాదునివలె శ్రీహరినామ చింతన విడువని భాగ్య మెపుడు గల్గునో, ఎన్ని కష్టములువచ్చినను ఎన్ని నష్టములు ప్రాప్తించినను హరిశ్చంద్రునివలె సత్యమును విడువని ఓర్పు, పట్టుదలయు నా కెపుడు లభించునో, ఎందరు బాధించినను, ఎన్ని చోట్లకు తిరిగినను ధర్మరాజువలె ధర్మమును తప్పక నడచు దృఢనిశ్చయమెపుడు సంప్రాప్తమగునో, ఎన్ని భోగభాగ్యములు ఉన్నను శ్రీబుద్ధునివలె వైరాగ్యలక్ష్మి ఎపుడు దొరకునో. సర్వకాలములయందును శ్రీ శుకమహర్షివలె భగ వచ్చింతనతో, విషయవిరక్తితో విహరించే మోక్షసామ్రాజ్యసుఖ మెపుడు చేకూరునో, పోతనామాత్యునివలె, త్యాగరాజువలె భగవంతు నొక్కనినే నమ్మి జీవించే భాగ్య మెపుడు వచ్చి సుఖ పెట్టునో. సక్కుబాయివలె, మీరాబాయివలె, గోదాదేవివలె, తరిగొండ వెంకమాంబవలె భగవానునకు జీవిత మర్పించే భాగ్య మెపుడు ప్రాప్తించునో. శ్రీ రమణమహర్షులవలె, శ్రీ అరవింద యోగివలె, శ్రీ శివానంద సరస్వతీస్వాములవారివలె, శ్రీమల యాళ సద్గురు భగవానునివలె తపస్సు చేసి, మానసాదీంద్రియ ములను జయించి ఆత్మసాక్షాత్కారజ్ఞానము నెపుడు పొందుదునో. ఈ విధముగా ఆవేదన యున్నచో క్రమముగా ఇంద్రియములు, గుణమును స్వాధీనమగును. మన జన్మ ధన్యమగును.

## ఆచరణ యనగా నేమి ?

పాపకర్మలను మాని పుణ్యకర్మల జేయుటయే ఆచరణ.

అనిత్యములైన నామరూపక్రియలపై ఆసక్తినుంచక నిత్యుడైన పరమాత్మయందు భక్తికలిగియుండుటయే ఆచరణ.

దేహదృష్టిని తొలగించుకొనుచు ఆత్మదృష్టిని పోషించుకొనుటయే ఆచరణ.

అడిగినవారికి శక్తికొలది ధనముతో, ధాన్యముతో, దేహముతో, వాక్కుతో, మనస్సుతో ఉపకారము చేయుటయే ఆచరణ.

ఇతరులు చేసిన అపకారములను సహించుటయే ఆచరణ.

తిట్టినవారిని తిట్టకుండుట, కొట్టినవారిని కొట్టకుండుట, నిన్నొక చెంపన కొట్టినపుడు రెండవ చెంపను కూడ నిచ్చుటయు ఆచరణయే యగును.

ప్రతిదినమును దైవ (గురు) పూజ, భగవన్నామ సంకీర్తన, జపము, ధ్యానము, విచారణల చేయుటయే ఆచరణ.

సర్వవాంఛలను వదలి ఒక్క భగవంతునినే నమ్మియుండుటయే ఆచరణ.

ఫలాపేక్షను వదలి అహంభావమును చంపుకొని దేవతలకు, పెద్దలకు, పేదలకు, రోగులకు, వృద్ధులకు సేవచేయుటయే ఆచరణ యగును.

మనోవాక్కాయములతో చేయబడిన సత్కర్మల (అనుష్ఠానముల) ఫలితము, దేహాభిమానము తగ్గుచు ఆత్మయందు నిలకడ కలుగుటయే.

## ఆచరణ స్వరూపము

శ్లో. అభియోగా త్త దభ్యాసా। త్తస్మిన్నేవచ నిశ్చయాత్ ।
పునః పునశ్చ నిర్వేదా। ద్యోగస్సిద్ధ్యతి నాఽన్యథా ॥

తా. 1) ఆసక్తినుంచుట—అనగా ధ్యాన (జ్ఞాన) సిద్ధి నొందవలెనని లేక మోక్షసుఖము నొందవలెనని ఎల్లప్పుడున్ను ప్రీతితో నుండుట.

2) అభ్యాసముచేయుట—అనగా జ్ఞాన (మోక్ష) ధర్మములను ఆచరణలో నుంచుటకు మాటిమాటికిని ప్రయత్నించుట యగును.

3) నిశ్చయము—అనగా ఎన్ని కష్ట నష్టములు వచ్చినను ముందుపెట్టినపాదమును వెనుకకుపెట్టరాదనియు, పరమాత్మను విడువరాదనియు, జ్ఞాన ధర్మ సాధనములను విడువనని దృఢ నిశ్చయము చేసికొనుట.

4) మాటిమాటికి పరితాపమొందుట—అనగా నాలో అజ్ఞానగుణములు నశించలేదే? గురువులు, శాస్త్రములు చెప్పినట్లుగా నేను మనస్సును (కామ క్రోధాది గుణములను) పూర్తిగా నిగ్రహించి అంతటను నిండియున్న పరమాత్మను ఎల్లప్పుడును గాంచలేకయున్నానే? నాలో సంకల్పములు, వాసనలున్ను పూర్తిగా ఎపుడు నశించును? పరమాత్మ సాక్షా

త్కారజ్ఞానము నా కెపుడు గల్గును? అను ఈవిధముగా తీవ్రతర మైన ముముతుత్వముతో పరితాపమునొందుట యగును.

ఈ పై జెప్పిన నాలుగును ఏసాధకునకు ఉండునో అతడే నిజమైన అనుష్ఠానపరుడనియు, సాధువనియు, భక్తుడనియును తెలియవలెను. పై జెప్పిన నాలుగున్ను లేనివారు ఎవరును యింతవరకు వృద్ధిలోనికి రాలేదు. జ్ఞానవంతులు కాలేదు.

ప్రపంచ (దేహ) వాసనలు నశించుచు దైవాత్మదృష్టి వృద్ధియగునట్లు మనోవాక్కాయములను నడిపించుటయే ఆచరణ యగును.

## నిత్యము నే నెట్లు నడువవలెను?

ప్రియమైన సోదర సోదరీమణులారా!

శ్రీహరీ శ్రీహరీ, శివశివా శివశివా, సద్గురుదేవా సద్గురుదేవా యనుచు నిద్రనుండి లెండు. తరువాత యిట్లు ప్రార్థించుడు.

నీ పాదకమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపారభూతదయయును
తాపసమందార నాకు దయసేయగదే.

ఓ భగవంతుడా, నీ దివ్యనామస్మరణ విడువక స్మరించే భాగ్యము నిమ్ము.

ఓ సర్వేశ్వరా, శరీరముతోగాని, వాక్కుతోగాని, మనస్సుతోగాని ఏప్రాణికిని బాధగలుగకుండునట్లు ప్రవర్తించే శక్తిని దయచేయుము.

ఓ జ్ఞానైకరూపా, నిత్యమైనవానిని నిత్యమైనవిగను, అనిత్యమైనవానిని అనిత్యములుగను గుర్తించు తెలివి నిమ్ము.

ఓ సద్గురుదేవా! మీ యాజ్ఞలను తప్పక నడచునట్టి వివేక ప్రజ్ఞా బలములను అనుగ్రహించుము.

ఈవిధముగా ప్రార్థనచేసి నిత్యకృత్యములను తీర్చు కొనుటకు వెళ్లుము.

నడచుచున్నపుడు, మలమూత్రములను విడచుచున్నపుడు, స్నానము చేయుచుండునపుడు, నారాయణమంత్రముగాని, శ్రీరామనామముగాని, శివనామమునుగాని జపించుచునే యుండుము. భోజనముచేయుచుండునవుడును తప్పక, ముద్ద ముద్దకును భగవన్నామము స్మరించుచుండుము.

సూర్యునకు, చంద్రునకు నమస్కారములు చేయు చుండుము.

కనబడిన దేవాలయములలోని దేవతాస్వరూపములకు (పటములకు) నమస్కారములు చేయుము.

పెద్దలకు, భక్తులకు, సాధువులకు, ధర్మాత్ములకు, ధర్మో పన్యాసకులకును నమస్కారములను జేయుము.

రామాయణము, భారతము, భాగవతము, ఉపనిషత్తులు మొదలగు సద్గ్రంథములకు నమస్కారములను జేయుము.

సమస్త నామ రూప ప్రపంచమును, సర్వదిక్కులను భగవత్స్వరూపముగా సంభావించి సంస్మరించుచుండుము.

## 2-వ పాఠము

పాపములేని పనులజేసి ఆహారమును సంపాదించుకొనుము. ఎవ్వరిసొమ్మును ఉచితముగా తీసికొనకుము.

ఇతరులకు బాధగలుగు పనులను మాటలను మానివేయుము. పెద్దలకు, వృద్ధులకు, అంగహీనులకు, రోగులకును, పేదలకును సేవ, సహాయములను చేయుము.

నీ వెవ్వరికిని ఋణపడి యుండకుము. విరోధివి గాకుండుము.

నీకు సంబంధములేని మాటలతోను, పనులతోను, మనుష్యులతోను జోక్యము పెట్టుకొనకుము.

మితముగా, మృదువుగా, ఇతరులకు మేలుగలుగునట్లుగా నిష్కపటముగా మాట్లాడుము.

తలలో నాలుకవలె అందరకును ప్రియముగా ప్రవర్తించుము.

పరులను దూషించకుము. అబద్ధము లాడకుము. ఇతరులు దూషించే పనులను చేయకుము.

క్రోధము, అసూయ, ద్వేషము, ఆశలను వదలి ధర్మమును, దైవమును నమ్మియుండుము.

మంచిగుణములు కలవారిపై ప్రేమ గలిగియుండుము. చెడుగుణములు గలవారిని ఉపేక్షతో కాంచుము. సజ్జనులతో సాంగత్యము చేయుము.

## 3-వ పాఠము

గొప్ప ధనముగలవారినైనను, గొప్ప సౌందర్యము, ఉద్యోగము, పాండిత్యము గలవారిని చూచినపుడు ముందుగానే గొప్పగా ప్రేమ జూపక మంచిగుణములు, మంచి ప్రవర్తనయును కలిగియున్నమాత్రమే ప్రేమ చూపుము. బాధలును పాపమును కలిగించునట్టి ప్రేమ చూపక పుణ్యము, భగవత్ప్రాప్తియు కలిగించునట్టి ప్రేమనే చూపుము.

సేవ, పూజ, పారాయణ, సంకీర్తన, జపము, ధ్యానము, విచారణ లలో నీకు యిష్టమైనవాటిని, మిక్కిలి ఉత్సాహమును వృద్ధిపరచునట్టివాటిని ఎక్కువసేపు చేసికొనుచు పుణ్యమును, దైవభావమును పెంచుకొనుము. ఉత్సాహములేని పుణ్యకార్యములఁ జేయకుము.

ఉత్సాహముతో చేయబడిన పుణ్యకార్యములు ఎక్కువ పుణ్యమును, శాంతిని, కీర్తిని కలిగించును.

పుణ్యకార్యములలో హెచ్చుతగ్గులు లేవు. భక్తిలోనే (భావములోనే) హెచ్చుతగ్గులు కలవు. భావమునననుసరించి పుణ్యముగాని, పాపముగాని కలుగుచుండును.

జప ధ్యాన సంకీర్తనలను చేయుచుండునపుడు గతించిన విషయములనుగాని, గడచుచున్న విషయములనుగాని, గడువబోవు విషయములనుగాని గుర్తునకు రానీయక భగవంతునిలో లీనమై యుండుము.

నీకుగల ధనముగాని, విద్యగాని, జనముగాని లెక్కలోనికి రావు. నీవు చేసిన మంచిచెడ్డలే లెక్కలోనికి వచ్చును. కనుక

నీకు అన్ని అనుకూలములు యున్నప్పుడే, పరోపకారముతో పుణ్యమును, నిత్యానిత్య విచారణముతో వైరాగ్యమును, భక్తితో జ్ఞానమును సంపాదించుకొనుము.

సజ్జనసాంగత్యము, పారాయణ, సేవ, పూజ, భజన, జప ధ్యానములు, విచారణ మొదలగు సత్కర్మలను జేయువారికి నిందలు, దరిద్రము, రోగములు, భయము, సందేహములు, కామక్రోధములు, చింతలు, నష్టములు, దుఃఖము మొదలగు విఘ్నములు వచ్చుచు పోవుచుండును. ఈ పరీక్షలకు చలించక పరమాత్మను భజించుచు సాధనాభ్యాసములను చేయుచుండు వారుమాత్రమే నిజమైన భక్తులు. సాధనపరులు ప్రజ్ఞాబలము కలవారలని చెప్పబడుదురు.

కష్టము లనెడి సబ్బుతోనే హృదయమనెడి వస్త్రము పరిశుద్ధ మగును.

దేవుని గుర్తునకు తీసికొనివచ్చి భజింపజేయునవి మంచి కష్టము లగును—దైవమును, ధర్మమును మరుగుపరచి పాపపు పనులను చేయించునవి చెడ్డకష్టము లగును. మంచికష్టములు పుణ్యాత్ములకు వచ్చి కీర్తివంతులను, సుఖవంతులను చేయును. చెడ్డకష్టములు పాపాత్ములకు వచ్చి మరింతదుఃఖములను, అప కీర్తిని కలిగించును.

అచంచలమైన భగవద్భక్తితోను, వైరాగ్యముతోను, ఓర్పుతోను కష్టములను దాటవలెను.



# పాతజీవితము - క్రొత్తజీవితము

శ్రీ చిన్మయ రామదాసు

1) ఇదివరకు పాపకార్యముల చేసితివిగాన ఇపుడు పుణ్యకార్యములనే చేయుచుండుము.

2) ఇదివరకు పామరులతో స్నేహము చేసితివిగాన ఇపుడు సజ్జనులతో స్నేహము చేయుచుండుము.

3) ఇదివరకు మత్స్య మాంసములను భుజించితివిగాన ఇపుడు శాకాహారమునే భుజించుచుండుము.

4) ఇదివరకు అసత్యముగా, అధికముగా, కఠినముగా మాట్లాడితివిగాన ఇపుడు సత్యముగా, మితముగా, మృదువుగా, చల్లగా మాట్లాడుచుండుము.

5) ఇదివరకు సంసారమునే ఆధారముగా జేసికొని యుంటివిగాన ఇపుడు సర్వేశ్వరునే ఆధారముగా జేసికొనుచు జీవించుచుండుము.

6) ఇదివరకు లోకమునకు అమ్ముడుపోతివిగాన ఇపుడు లోకేశ్వరునకు అమ్ముడుపొమ్ము.

7) ఇదివరకు సత్య ధర్మాది శాస్త్రధర్మములను తప్పి నడచితివిగాన ఇపుడు భగవద్గీతాది శాస్త్రధర్మములను అనుసరించి తప్పక నడుచుచుండుము.

8) ఇదివరకు వ్యర్థములైన రూపములను చూచితివి, వ్యర్థములైన శబ్దములను వింటివిగాన ఇపుడు జన్మసార్థకము చేయు రూపములను చూడుము, శబ్దములను వినుము.

9) ఇదివరకు భార్యాపుత్రాదులు నా వారనుకొంటివి గాన ఇపుడు భగవంతుడును, భక్తులును నా వారనుకొనుము.

10) ఇదివరకు ధనవంతులకును, ఉద్యోగస్థులకును నమస్కరించితివిగాన ఇపుడు దేవతలకు, సాధువులకు, భక్తులకు, మహాత్ములకును నమస్కరించుచుండుము.

11) ఇదివరకు తిట్టినవారిని తిట్టితివి, దూషించినవారిని దూషించితివి కాన ఇపుడు తిట్టినవారికిని, దూషించినవారికిని, కొట్టినవారికిని నమస్కరించుచుండుము.

12) ఇదివరకు పశువులపై, ధనముపై, కుటుంబముపై పెత్తనము చేసితివిగాన ఇపుడు దేహముపై, ఇంద్రియములపై, మనస్సుపై పెత్తనముచేసి జ్ఞానమార్గమున నడిపించుచుండుము.

13) ఇదివరకు సంసారసుఖమును అమృతముగాను, దైవ సుఖమును విషముగాను భావించితివిగాన ఇపుడు సంసారమును విషముగాను, దైవమును అమృతముగాను సంభావించు చుండుము.

14) ఇదివరకు కోరికలతో, క్రోధముతో సుఖమొంద దలచితివిగాన ఇపుడు నిష్కామముతోను, శాంతముతోను సుఖ మొందుటకు ప్రయత్నించుచుండుము.

15) ఇదివరకు నేను, నీవు, నాది, నీది యను భేదభావము లతో వర్తించితివిగాన ఇపుడు సమత్వభావముతో ప్రవర్తించు చుండుము.

16) ఇదివరకు ఈ దేహమునే నేను అని నిశ్చయించు కొంటివిగాన ఇపుడు స్థూల సూక్ష్మ కారణ శరీరములకు సాక్షిగా నున్న పరమాత్మయే నేనని నిశ్చయించుకొనుచుండుము.

17) ఇదివరకు అన్నమంత సంసార (లోక) చింతనతోను, కూరంత దైవచింతనతోను ఉంటివిగాన ఇపుడు అన్నమంత దైవ చింతనతోను, కూరంత సంసారచింతనతోను కాలమును గడుపు చుండుము.

18) ఇదివరకు సృష్టిని ప్రేమించితివిగాన ఇపుడు సృష్టి కర్తను (దైవమును) ప్రేమించుచుండుము.

19) ఇదివరకు నీ సంసారమునే, గ్రామమునే చూచు చుంటివి గాన ఇపుడు సమస్తప్రపంచమును చూచు చుండుము. ప్రేమించు చుండుము.

20) ఇదివరకు పరుల తప్పులను వెదకుచుంటివిగాన ఇపుడు నీ తప్పులను నీవు సర్వదా వెదకుకొనుచుండుము.

## తప్పక నడువుము

నీవు నీ పనులను ప్రారంభించుటకుముందు, ఎచటికైనను ప్రయాణము చేయుటకుముందు, రాత్రి నిద్రించుటకుముందు భగవంతునకు, మహాత్ములకు నమస్కరించుము. ప్రార్థన, జపము, ధ్యానమును తప్పక చేయుము.

తప్పుపనులు చేయువారికి భగవంతునిపై, సద్గురువుపై, సద్ధర్మములపై, భక్తి, నమ్మికయు నిలువవనియు, భక్తిలేని వారికి విషయభోగములపై విరక్తి కలుగదనియు, విరక్తిలేని వారికి మనశ్శాంతి కలుగదనియు, మనశ్శాంతిలేనివారికి ఆత్మ స్వరూపజ్ఞానము గలుగదనియు, ఆత్మజ్ఞానములేనివారికి దుఃఖ నివృత్తి, ఆనందప్రాప్తియు సిద్ధించదనియును నమ్మియుండుము.

తాత్కాలిక సుఖములకు, లాభములకు, గౌరవములకును లోబడకుము.

ఎన్నికష్టములు ప్రాప్తించినను సర్వేశ్వరుని, సద్గురువును, సత్య ధర్మములను మరువకుము.

ప్రపంచ నామరూపదృష్టిని (ప్రపంచభావములను) మెల్ల మెల్లగా వదలివేయుచు, దైవాత్మదృష్టిని సుస్థిరము చేసికొనుటయే సాధనాభ్యాసములయొక్క ఫలితమని తెలసికొని యుండుము.

నీ జీవితముపై మమకారమును, కర్తృత్వమును పెట్టు కొనక భగవంతునిపై ఆధారపడియుండుము.



## 4వ పాఠము

ఇతరులు మెచ్చుకొనవలెనను భావముతో ఏపనిని చేయకుము.

నన్ను దూషించిరి(తిట్టిరి), నన్ను బాధించిరి, నావస్తువు లను తీసికొనిపోయిరి యని తలంచుచున్నంతవరకును, నాకు ధనాదిభోగములు కలవు యనిగాని, లేవు యనిగాని తలంచు చున్నంతవరకు నీకు నిజమైన భగవద్భక్తి (నమ్మిక) కుదుర లేదనియు, ప్రపంచము అనిత్యమైన దను విషయము తెలియబడ లేదనియును గుర్తించుము.

ఇదివరకుగాని ఇప్పుడుగాని చేసిన దోషములవలన ఏరూప ముగానైనను కష్టములు కలుగుచుండునని నమ్మియుండి పాతపాపదోషములను ఓర్పుతో అనుభవించుచు క్రొత్తపాప ములను చేయకుండుము.

ఇతరులు నిన్ను దూషించినను నీవు దూషించకుము.

ఇతరులు క్రోధము చూపినను నీవు ద్వేషము కలిగి యుండకుము.

ఇతరులు కొట్టినను నీవు కొట్టకుము.

ఇతరులు అసత్యములాడినను నీవు అబద్ధములు చెప్పకుము.

ఇతరులు ఆశలతో (కోరికలతో) యున్నను నీవు నిరాశతో (నిష్కామముతో) నుండుము.

ఇతరులు లోభగుణముతో నున్నను నీవు త్యాగగుణముతో నుండుము.

ఇతరులు లోకచింతలతో, మాటలతో నున్నను నీవు దైవచింతనతో, భగవన్నామసంకీర్తనతో నుండుము.

ఇతరులు జనసంఘములో నున్నను నీవు ఒంటరిగా భగవదనుగ్రహము గలుగుటకు వెదకుచుండుము.

ఇతరులు నీచేత సేవచేయించుకొనినను నీవు ఇతరులచే సేవ చేయించుకొన గోరకుము.



## ఇంద్రియనిగ్రహము - ఆత్మసుఖము

అనేకులు ఇంద్రియనిగ్రహమన నేమో తెలియకనే యున్నారు. ఇంద్రియనిగ్రహము గలవారే అక్షయమైన పరబ్రహ్మసుఖము నొందుదురని సమస్త వేదాంతశాస్త్రములును, మహాత్ములును చెప్పుచున్నారు.

కర్మేంద్రియము లైదు. జ్ఞానేంద్రియము లైదు. అంతరింద్రియములు నాలుగు. మొత్తము పదునాలుగింద్రియములను అధర్మ (పాప) మార్గమున నడువనీయక ధర్మ (పుణ్య) మార్గమున నడిపించుట మొదటి నిగ్రహ మగును. శుభాశుభ (పుణ్యపాప) మార్గముల రెంటిని వదలి స్వాధీనమం దుంచుకొని ఆత్మస్థితియందు సుఖముగా నుండుట రెండవ నిగ్రహ మనబడును.

## కర్మేంద్రియములు

పాదములతో చెడుస్థలములకు, పరులకు బాధగలుగు స్థలములకు నడువకుము.

చేతులతో ఇతరులకు బాధగలుగు పనులను చేయకుము.

గుదేంద్రియముతో పరులకు బాధగలుగు స్థలములందు మలవిసర్జన చేయకుము.

గుహ్యేంద్రియముతో బ్రహ్మచర్యవ్రతమును తప్పకుండుటయేగాక ఇతరులకు బాధకలుగు స్థలములలో మూత్రమును విడువకుము.

వాగింద్రియముతో మితముగా మాట్లాడుము. పరులకు బాధగలుగు మాటలను పలుకకుము.

## జ్ఞానేంద్రియములు

నేత్రములతో దైవమును, ధర్మమును మరచునట్లుచేయునట్టి రూపములను, పనులను చూడకుము.

చెవులతో దైవభావమును, ధర్మగుణములను చెరచునట్టి మాటలను, శబ్దములను వినకుము.

జిహ్వాతో అసాత్త్వికాహారమును, అన్యాయార్జితాహారమును భుజించకుము. నియమితకాలమున మితముగా భుజించుము.

నాసికతో విషయాసక్తిని కలిగించు వాసనలను చూడకుము.

చర్మముతో అపవిత్రులను, నీచవస్తువులను తాకకుము. మహాత్ములను, దేవతాసంబంధమైన రూపములను తాకుము.

## అంతరింద్రియములు

మనస్సుతో భగవన్మహిమలను, మహాత్ములలోగల సద్గుణములను, భక్తి జ్ఞాన వైరాగ్యాది ధర్మములను మననము(విచారణ) చేయుము.

చిత్తముతో మోక్షధర్మములనే మోక్షస్వరూపములనే చింతించుచుండుము.

బుద్ధితో అజ్ఞానగుణములగు భావములను, రూపములను ధ్యానించక పరమాత్మను పొందింపజేయునట్టి రూపములను, శబ్దములను, గుణములను ధ్యానించుచుండుము. మంచి నిశ్చయములనే చేయుము.

అహంకారముతో స్థూల సూక్ష్మ కారణ దేహములు నేను గాను. త్రివిధశరీరములను, త్రివిధావస్థలను తెలిసికొనుచున్న సచ్చిదానందాత్మయే నేను యని సంభావించుచుండుము. ఇది సాధ్యపడనిచో క్రమముగా నేను పుణ్యాత్ముడను, నేను భక్తుడను, నేను శిష్యుడను, నేను జపధ్యానయోగిని, నేను సర్వసాక్షిని, నేను బ్రహ్మనిష్ఠుడను యని నిశ్చయించుకొని యుండుము.

ఈ విధముగా పదునాలుగు ఇంద్రియములను పురుష ప్రయత్నముతో, భగవంతుని అనుగ్రహముతో, సద్గురువుల దివ్యాశీర్వాదములతోను స్వాధీనపరచుకొనినవారే బ్రహ్మజ్ఞానులు, ముక్తులును.

## త్రివిధ తప్పులు

1) జన్మమెత్తుట మొదటితప్పు. పుణ్యకార్యముల జేయకుండుట రెండవతప్పు. పరమాత్మచింతనతోనుండక ప్రపంచ (సంసార) చింతలతో మరణించుట మూడవతప్పు.

2) పాపకర్మల జేయుట మొదటితప్పు. పాపఫలితము అనుభవమునకు వచ్చినపుడు ఏడ్చుట రెండవతప్పు. తాను బాధపడుచు ఇతరులకుకూడ శ్రమకలిగించుట మూడవతప్పు.

3) చెడ్డపనులుచేయుట మొదటితప్పు. ఇతరులు తిట్టిరి, కొట్టిరి యనుకొని పరులకు చెప్పుట రెండవతప్పు. భయము, సిగ్గు లేకుండ మరల తప్పుచేయుట మూడవతప్పు.

4) అనవసరముగా ఇతరులతో మాట్లాడుట మొదటి తప్పు. ఇతరులకు బాధకలుగు మాటలు పలుకుట రెండవతప్పు. తాను మాటలద్వారా పాపమును, అపకీర్తిని తెచ్చుకొనుట మూడవతప్పు.

5) మనస్సులో క్రోధము పుట్టుట మొదటితప్పు. వాక్కుద్వారా క్రోధమును బయటకు వెడలగ్రక్కుట రెండవతప్పు. శరీరముతో పరులకు బాధకలుగు పనులుజేయుట మూడవతప్పు.

6) మనస్సులో ఇతరులను సహాయము కోరదలచుట మొదటితప్పు. వాక్కుతో సహాయముకోరుట రెండవతప్పు.

అడిగినను సహాయము చేయలేదని పరులకు చెప్పుట, దూషించు టయు మూడవతప్పు.

7) ఇతరులదగ్గరకు వెళ్లుట మొదటితప్పు. మర్యాద చేయలేదనుకొనుట రెండవతప్పు. మర్యాద చేయలేదని పరులకు చెప్పుట, దూషించుటయు మూడవతప్పు.

8) ప్రీతితో సంపాదించుట మొదటితప్పు. సంపాదించు కొనినవాటితో బాధపడుట రెండవతప్పు. తనవస్తువుల నిమిత్తము పరులతో విరోధములు తెచ్చుకొనుట మూడవతప్పు.

9) పాపకర్మల చేయుట మొదటితప్పు. పుణ్యకర్మల చేయకుండుట రెండవతప్పు. పరమాత్మను మరచియుండుట మూడవతప్పు.

10) ఇతరులను పొగడుట మొదటితప్పు. తరువాత నిందించుట రెండవతప్పు. తన్నుతాను పొగడుకొనుట మూడవతప్పు.

11) ఇతరుల సొమ్మును ఉచితముగా తీసికొనుట మొదటి తప్పు. తీసికొనినవాటిని దుర్వినియోగపరచుట లేక పాడు చేయుట రెండవతప్పు. తనసుఖముకొరకు దాచుకొని పాపము నొందుట మూడవతప్పు.

12) ఇతరుల ఆహారమును తినుట మొదటితప్పు. భుజించిన ఆహారమును చెడుచింతలతో, వ్యర్థసంభాషణలతో, వ్యర్థ క్రియలతోను జీర్ణము చేసికొనుట రెండవతప్పు. సోమరియై అపకీర్తిపాలగుట మూడవతప్పు.

13) దేవునిపై విశ్వాసములేకుండుట మొదటితప్పు. ఆయనను భజించకుండుట రెండవతప్పు. భగవంతుని గాంచ కుండుట జీవితములో మూడవతప్పు.

14) అధికముగా ధనమును కూడబెట్టుట మొదటితప్పు. దానము చేయకుండుట రెండవతప్పు. ద్రవ్యాచింతనతో మరణించుట మూడవతప్పు.

15) భగవద్భక్తితో భగవద్గీతాదులను చదువకుండుట మొదటితప్పు. పాండిత్యముతో వితండవాదముల జేయుట రెండవతప్పు. ఆచరించక పాతకమునొందుట మూడవతప్పు.

16) మన నిజస్వరూపాత్మను మరచుట మొదటితప్పు. దేహామే నేననుకొనుట రెండవతప్పు. దేహామున కన్యమైన మానవులపై, వస్తువులపై రాగ ద్వేషముల నుంచుట మూడవ తప్పు.

17) దైవమును మరచుట మొదటితప్పు. దైవమునకన్న ప్రపంచమును వేరుగా గాంచుట రెండవతప్పు. మరల మరల జనన మరణముల నొందుట మూడవతప్పు.

18) న్యాయముగా సంపాదించకుండుట, దాన ధర్మములను చేయకుండుటయు గృహస్థుని తప్పు.

19) కామక్రోధాది గుణములను వదలకుండుట, పరమాత్మను మరచుటయు సన్న్యాసి తప్పు.

## అధికారులు

పాపకర్మల జేయనివారే జీవించుటకు అధికారులు.

ఉచితముగా ఇతరుల సొమ్మును తీసికొనని ( తినని ) వారే దానము చేయుటకు అధికారులు.

స్వార్థగుణము లేనివారే పరోపకార మొనర్చుటకు అధికారులు.

దానధర్మముల చేయువారే గృహస్థులగుటకు అధికారులు.

ఇంద్రియ విషయసుఖములపై విరక్తిగలవారే (గృహా మును త్యజించి, పరమాత్మ యొక్కనిపై నాధారపడి జీవించు శక్తి గలవారే) సన్న్యాసాశ్రమస్వీకారమునకు అధికారులు.

వినయ విధేయతలు గలవారే సేవ చేయుటకు అధికారులు.

ఆచరించుటకు శక్తిగలవారే చదువుటకును, వినుటకును, చూచుటకును అధికారులు.

స్తుతినిందలకు, సుఖదుఃఖములకు, లాభనష్టములకును చలించనివారే లోకసేవాది సత్కర్మల చేయుటకు, చేయించు టకును అధికారులు.

భగవత్కృప నొంద దలచువారే పూజచేయుటకును, భజనచేయుటకును అధికారులు.

తను ధన మనములను సద్గురువునకు సమర్పించు శక్తి గలవారే శిష్యులగుటకు (మంత్రోపదేశ మొందుటకు) అధి కారులు.

నాది, నావారు యను మమకారము క్షీణించినవారే జప ధ్యాన నిష్ఠల చేయుటకు అధికారులు.

కామక్రోధములకు లోబడనివారే మఠములలో నివ సించుటకు అధికారులు.

వివేకము, వైరాగ్యము, ఇంద్రియనిగ్రహము, మోక్షా పేక్షయున్ను కలవారే మహావాక్యోపదేశ మొందుటకు అధి కారులు.

జిహ్వాచాపల్యము, గుహ్యేంద్రియచాపల్యము, ధనకాంక్ష, కీర్తికాంక్ష లేనివారే గురువుగా నుండుటకు అధికారులు.

సర్వమును పరబ్రహ్మమయముగా గాంచువారే వేదాంతోపన్యాసము లిచ్చుటకు అధికారులు.

సంకల్పములను నశింపచేయుచుండువారే పరబ్రహ్మ సాక్షాత్కారజ్ఞానము నొందుటకు అధికారులు.

సర్వదా పరమాత్మను భజించుచుండువారే మౌన వ్రతమునం దుండుటకు, పరులభిక్షను స్వీకరించుటకు అధికారులు.

భగవంతుని అనన్యశరణాగతి నొందియుండువారే ఇతరుల నేమియు నడుగక జీవించుటకు అధికారులు.

దేహాభిమానము నశించినవారే పుణ్యపాపములకు, సుఖదుఃఖ, స్తుతినింద, లాభనష్టములకును అతీతులగుటకు అధికారులు.

పరమాత్మయొక్క ఉనికిని (స్థానము) గుర్తించినవారే సర్వదా ఏకాంతప్రదేశమం దుండుటకు అధికారులు.

అఖండాత్మానుభూతితో నుండువారే ప్రపంచ నామరూప క్రియలకు అంటక ప్రవర్తించుటకు అధికారులు.

## ముందు - వెనుక

1) భగవంతుని పూజించుటకుముందు తల్లిదండ్రులను పూజించుట నేర్చుకొనుము.

2) ఉపకారముచేయుటకుముందు అపకారమును చేయకుండుట నేర్చుకొనుము.

3) పుణ్యకార్యములను చేయుటకుముందు పాపకార్యములను మానియుండుము.

4) సజ్జనసహవాసము చేయుటకుముందు దుర్మార్గులతో సహవాసము చేయకుండుట అభ్యసించియుండుము.

5) స్తుతించుటకుముందు నిందించకుండుట నేర్చియుండుము.

6) వివాహము చేసికొనుటకుముందు గృహస్థధర్మములను తెలిసికొనియుండుము.

7) గృహమును త్యజించుటకుముందు సన్న్యాస ధర్మ నియమములను తెలిసికొనియుండుము.

8) కీర్తికలుగు పనులను చేయుటకుముందు అపకీర్తిగలుగు పనులను మానియుండుము.

9) భోజనము చేయుటకుముందు దైవచింతన గలిగియుండుము.

10) ఇతరులదగ్గర తీసికొనుటకుముందు ఇచ్చియుండుము.

11) దానధర్మములను చేయుటకుముందు ఇతరులదగ్గర తీసికొనకయుండుట నేర్చియుండుము.

12) పెద్దలకు (గురువులకు) సేవచేయుటకుముందు భయభక్తులు, వినయవిధేయతలను గలిగియుండుము.

13) మంత్రోపదేశము నొందుటకుముందు సద్గురువునకు తను ధన మనస్సులను సమర్పించియుండుము.

14) పూజ జప ధ్యాన శ్రవణములు చేయుటకుముందు నిశ్చలముగా కూర్చొనుట నేర్చుకొనియుండుము.

15) జప ధ్యాన ఆత్మానాత్మ విచారణలను జేయుటకు ముందు ఇంద్రియవిషయములపై విరక్తి కలిగియుండుము. మనస్సును నిశ్చలమొనర్చెడి ఉపాయములను తెలిసికొని యుండుము.

16) మాట్లాడుటకుముందు మాట్లాడేవిధమును నేర్చుకొనియుండుము.

17) ఇతరులకు బోధించుటకుముందు నీవు ఆచరించి అనుభవము నొందియుండుము.

18) చచ్చుటకుముందే పుణ్యమును, జ్ఞానమును, సంపాదించుకొనియుండుము.

## సత్యపదములు

1) పుణ్యములేనివారికి సద్గుణములు, సంతోషమును నిలువవు.

2) భక్తిలేనివారికి భగవంతునిపై, సద్గురువులపై దృష్టి నిలువదు.

3) విచారణచేయనివారికి యథార్థము తెలియదు.

4) వైరాగ్యములేనివారికి భక్తి, జ్ఞానములు నిలువవు.

5) ఆశలుకలవారికి తపశ్శక్తి నిలువదు.

6) పరులను బాధించువారికి కీర్తి నిలువదు.

7) అపరిగ్రహవ్రతములేనివారికి పుణ్యము నిలువదు.

8) నాది, నావారు యను మమకారము గలవారికి బంధము తొలగదు.

9) పరమాత్మసేవగాని, ప్రజలసేవగాని చేయనివారికి అన్నవస్త్రాదులు లభించవు.

10) అభ్యాసముచేయనివారికి మానసాదింద్రియములు వశముకావు.

11) నేను యను అహంకారముగలవారికి సమత్వజ్ఞానము కలుగదు.

12) ఆత్మను మరచినవారికి అఖండదృష్టి (ప్రేమ) నిలువదు.

13) కపటముతో వర్తించు (మాట్లాడు) వారికి సత్ఫలము లభించదు.

14) భోగములఁ గోరువారికి యోగము కుదురదు.

15) లోకమును చూచువారికి లోకేశుడు కనబడడు.

16) ఆత్మజ్ఞానము కలుగనివారికి జననమరణ దుఃఖములు నశించవు.

## రక్షించేదొకటి - శిక్షించేదొకటి

భగవంతునకు, మానవాదిప్రాణులకును చేసిన సేవ నిన్ను రక్షించును. దేవునకు, ఇతరజీవులకును అప్రియము గలిగించినచో అది నిన్ను శిక్షించును.

దేవునిపైగల నమ్మిక నిన్ను రక్షించును. ప్రపంచముపై గల నమ్మిక నిన్ను శిక్షించును.

శాంతము నిన్ను రక్షించును. క్రోధము నిన్ను శిక్షించును. నిష్కామము నిన్ను రక్షించును. కామము నిన్ను శిక్షించును.

నిర్మమత్వము నిన్ను రక్షించును. మమత్వము నిన్ను శిక్షించును.

సమత్వదృష్టి నిన్ను రక్షించును. భేదదృష్టి నిన్ను శిక్షించును.

నిరహంకారము నిన్ను రక్షించును. అహంకారము నిన్ను శిక్షించును.

పుణ్యము (ధర్మము) నిన్ను రక్షించును. పాపము (అన్యాయము) నిన్ను శిక్షించును.

త్యాగబుద్ధి నిన్ను రక్షించును. లోభగుణము నిన్ను శిక్షించును.

ఆత్మబుద్ధి నిన్ను రక్షించును. దేహబుద్ధి, దేహాభిమానము నిన్ను శిక్షించును.

నిస్సంకల్పము (నిర్వికల్పము) నిన్ను రక్షించును. సంకల్పము నిన్ను శిక్షించును.

దైవార్పణ చేయబడిన కర్మలు నిన్ను రక్షించును. దేహార్పణ చేయబడిన కర్మలు నిన్ను శిక్షించును.

నిర్గుణానందము నిన్ను రక్షించును. సగుణానందము నిన్ను శిక్షించును.

## పూజ యన నేమి ?

పుణ్యప్రదేశములగు దేవాలయములను, పుణ్యతీర్థములను పుణ్యాశ్రమములను గౌరవించుటయే పూజ.

తులసి, రావి, మఱ్ఱి, మారేడు మొదలగు పుణ్యవృక్షములను గౌరవించుటయే పూజ.

మంచి గ్రంథములను, మహాత్ముల యొక్కయు, దేవతల యొక్కయు పటములను విగ్రహములను గౌరవించుటయే పూజ.

సూర్యచంద్రులను, మహాత్ములను, సాధువులను, పరమ భక్తులను గౌరవించుటయే పూజ.

మంచి పనులను, మంచి మాటలను, మంచి గుణములను, మంచి సంకల్పములను, మంచి భావములను గౌరవించుటయే పూజ.

ఈ నామరూపజగమంతయున్ను భగవత్స్వరూపమని, పరబ్రహ్మస్వరూపమని, స్వాత్మస్వరూపమే యని సంభావించుటయే పూజ.

నీలోగల త్రివిధావస్థలకు, శరీరత్రయములకు, సుఖదుఃఖాది వికారములకు, సాక్షిగాయున్న పరమాత్మను గౌరవించుటయే పూజ.

కనబడునది, వినబడునది, తాకబడునది, తినబడునది, వాసన చూడబడునదియు నగు సర్వమున్ను నా యాత్మయే, సర్వము నేనే యను అనుభవము నొందియుండుట సర్వపూజల అక్షయఫలిత మగును.

## విజయోపాయములు

1) పుణ్యకర్మల నాధారముగ చేసికొని పాపకర్మలను జయించుము.

2) సద్గుణముల నాధారముగ చేసికొని దుర్గుణములను జయించుము.

3) భగవంతుని ఆధారముగా జేసికొని లోక (సంసార) భ్రాంతులను జయించుము.

4) సద్గురువులను ఆధారముగా జేసికొని మానసాదింద్రియములను జయించుము.

5) నిర్వికల్పసుఖము నాధారముగా జేసికొని సంకల్పములను జయించవలెను.

6) ఆత్మదృష్టిని ఆధారముగా జేసికొని అనాత్మభావములను జయించవలెను

7) పరబ్రహ్మానుభవము నాధారముగా జేసికొని ద్వైతభావములను నశింపజేయవలెను.

## మార్పులేని నియమములు

ఇచ్చువారు పుచ్చుకొనక తప్పదు, పుచ్చుకొనువారు యివ్వక తప్పదు.

కొట్టువారు మరల దెబ్బలు పడక తప్పదు, దూషించువారు దూషణ పడక తప్పదు.

సుఖములు లభించవలెనని కోరువారు దుఃఖపడక తప్పదు.

నావి యని తలంచువారు వాటిని వదలిపెట్టక తప్పదు.

లభించిన వస్తువులు నశించక తప్పదు.

అభ్యాసము చేసినయెడల చంచలమనస్సు నిశ్చలముకాక తప్పదు.

ఆత్మధ్యానము చేయుచున్నయెడల పరమాత్మదర్శనము కలుగక తప్పదు.

# సద్వచనములు

నీవు ధనమును సంపాదించక యుండలేనిచో న్యాయమైన వృత్తితోనే సంపాదించుము.

నీవు ధనమును కర్చుపెట్టక యుండలేవు. కనుక పాపము కలుగని పనులకే కర్చుపెట్టుము.

నీవు ఎవ్వరితోను స్నేహము చేయక యుండలేనిచో సాధువులతోను, దేవునితోను స్నేహము చేయుము.

నీవు ఎల్లప్పుడును మౌనముగా నుండలేనిచో సద్గ్రంథ పఠన, భగవన్నామసంకీర్తన, సత్యధర్మ సంభాషణలనే చేయుము.

నీవు భోజనము చేయక యుండలేవుకనుక న్యాయార్జిత మైన మిత సాత్త్వికాహారమునే పరమాత్మభావనతో భుజించుము.

నీవు పనినీ చేయక యుండలేనిచో ఇతరులకు మేలు కలుగు పనులనుగాని, దేవుని సేవగాని చేయుచుండుము.

నీవు ఏకోరికయులేక యుండలేనిచో భగవంతుని మరువకయుండు భాగ్యమునే సదా కోరుచుండుము.

నీవు నామరూప ప్రపంచ విషయములను ధ్యానించక యుండలేనిచో భగవత్స్వరూపములనే, మహాత్ములనే, సద్గుణ ములనే ధ్యానించుచుండుము.

నీవు సంకల్పరహిత సుఖములో నుండలేనిచో ఓంకార నారాయణ రామ కృష్ణాది మంత్రములను, గీతాది శాస్త్రధర్మ ములను స్మరించుచుండుము.

నీవు ఎప్పటికైనను సంసారమును, దేహమును వదలిపెట్టక యుండవు కనుక ఇప్పుడే మనస్సులో (హృదయములోగల) సంసారభ్రాంతిని, దేహబుద్ధిని (దేహాభిమానమును) త్యజించి ఆత్మదృష్టితో సుఖముగా నుండుము.

---

## సత్యము - ధర్మము

(జీవితపర్యంతమును కాపాడుకొనదగినవి)

సత్యమును, ధర్మమును మానవుడు తప్పి నడువరాదని పెద్దలు, శాస్త్రములున్ను చెప్పుచున్న విషయము అందరకు తెలిసియే యున్నదిగదా !

సత్యధర్మములను మనము రెండు నేత్రములుగా, రెండు చేతులుగా, రెండు పాదములుగా చేసికొని ప్రవర్తించిన మాత్రమే ఇహపరములందు సుఖముగా నుండగల్గుదుము.

మనవారిలో అనేకులు ధనాదివస్తువులకు లోబడి, బంధుమిత్రాదులకు లోబడి, స్వదేహరక్షణకు లోబడి, కీర్తిప్రతిష్ఠలకు లోబడి, సుఖదుఃఖములకు, స్తుతినిందలకు లోబడి సత్యధర్మములను తప్పి నడచుచున్నారు. సత్యధర్మములను తప్పి నడచువారికే అనేకవిధములుగా దుఃఖములు, బాధలు వచ్చుచుండును.

సత్యమనగా శాశ్వతానందస్వరూపమగు పరమాత్మ యనబడును. ధర్మమనగా పరమాత్మను పొందించునట్టి పుణ్యావర్తనలు, సద్గుణములు నగును.

ఎన్ని శ్రమలకోర్చియైనను సత్యమును, ధర్మమును వదలక కాపాడుకొనుచుండువారి జీవితమే నిజమైన జీవిత మనబడును. సత్యధర్మములను కాపాడుకొనువిషయములో యెవరు అడ్డు వచ్చినను వారిని లెక్కచేయక త్యజించవలెను.

సత్యధర్మములను తప్పి నడచుచున్నపుడు సుఖముగా నున్నట్లు తోచుచున్నప్పటికిన్ని కర్మఫలమును అనుభవించే కాలము వచ్చినప్పుడు దుఃఖముతో విలపింపకతప్ప దను విషయమును గుర్తులో నుంచుకొనవలెను.

హరిశ్చంద్రుడు సత్యమునునమ్మి రాజ్యమును(ధనమును), భార్యను, పుత్రుని పోగొట్టుకొనుటయేగాక తానును అమ్ముడు పోయెనుగదా !

ప్రహ్లాదుడు శ్రీహరిని నమ్మి తల్లి తండ్రి గురువుల యాజ్ఞలనుకూడ తృణీకరించెను.

భరతుడు ధర్మమును నమ్మి తల్లియగు కైక రామ రాజ్యమునకు పట్టాభిషిక్తుడవు కమ్మని చెప్పినను ఆమెవాక్యమును చెల్లించలేదు.

పాండవులు ధర్మమును నమ్మి కౌరవుల యాజ్ఞ ప్రకారము అరణ్యవాసము, అజ్ఞాతవాసముల చేసిరి.

కర్ణుడు న్యాయమార్గమును నమ్మియుండుటచే కౌరవులను వదలి పాండవపక్షమున నుండుమని తల్లి, తండ్రి, శ్రీ కృష్ణభగవానుడును చెప్పినప్పటికిని పెడచెవిని పెట్టెను.

భీష్మాచార్యులవారు బ్రహ్మచర్య ధర్మమును నమ్మియుండుటచే గురువగు పరశురాముడు వివాహముచేసికొనుమని చెప్పినప్పటికిని తనదీక్షను తప్పలేదు.

బలిచక్రవర్తి సత్యమును నమ్మి గురువగు శుక్రాచార్యుని వాక్యమును తిరస్కరించివేసెను.

విభీషణుడు ధర్మమును నమ్మి అన్నలగు రావణ కుంభకర్ణులను వదలి శ్రీరామచంద్రప్రభువును శరణు బొందెను.

రామానుజాచార్యులు తన భార్య తాను చెప్పిన ధర్మములను తప్పి నడచుటవలన ఆమెను త్యజించెను.

శ్రీ తరిగొండ వెంకమాంబ శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామిని స్వభర్తగా నమ్మి వివాహమాడిన మానవభర్తను త్యజించుటయేగాక తల్లి తండ్రి బంధువులను, పెద్దలవాక్యములను తిరస్కరించివేసి తిరుపతిక్షేత్రమందే నివసించి చివరకు శ్రీ వేంకటేశ్వరస్వామియందైక్యమయ్యెను.

మీరాబాయి శ్రీకృష్ణభగవానునే భర్తగా నెంచుకొని నమ్మి భజియించుచు తల్లిదండ్రాదుల యాజ్ఞలను తృణీకరించి చివరకు శ్రీకృష్ణపరమాత్మయందైక్యమయ్యెను.

గుణవతీబాయి, శీలాబాయి, సక్కుబాయియు భర్తల ఆజ్ఞలను తిరస్కరించి భగవంతు నొక్కనినే నమ్మి భజియించుచు చివరకు భర్తలనుకూడ భగవద్భక్తులనుగా మార్చివైచిరి.

గృహస్థులైనను సన్న్యాసులైనను సత్యమును (దైవమును), ధర్మమును తప్పక ప్రవర్తించినమాత్రమే జీవితమును ఆనందమయముగా చేసికొనగల్గుదురు.

గృహస్థులు ధనాదివస్తువులను అన్యాయముగా సంపాదించుటచేత, కూడబెట్టుటచేత, ఋణములను చేయుటచేత, ఇతరులతో విరోధముల బెట్టుకొనుటచేతను చెడిపోవుదురు.

సన్న్యాసులు పరమాత్మస్మరణతో భగవంతునిపై జీవిత భారము నుంచకపోవుటచేత, కోరికలతో నుండుటచేతను, పరులను ధనాదివస్తువులను యాచించుటచేత, మానసాదీంద్రియములను నిగ్రహించకపోవుటచేతను చెడిపోవుదురు.

## అన్నము నెందుకు తినవలెను ?

పామరులు తినుటకే, విషయభోగములను అనుభవించుట కొరకే మనము పుట్టితిమని తలంతురు.

వివేకులు కర్మవలన మనకు జన్మవచ్చినది కనుక కర్మదోష ములను నశింపజేసికొనుటకే మనము పుట్టితిమని తలంతురు.

అవివేకులు అన్నవస్త్రములు, ఆయురారోగ్యముల నిమ్మని భగవంతుని ప్రార్థించెదరు.

వివేకులు భక్తి, జ్ఞానము, వైరాగ్యముల నిమ్మని పరమాత్మను ధ్యానించుచుందురు.

భూదేవియొక్క బిడ్డ అన్నము. అన్నముయొక్క బిడ్డ దేహము. దేహముయొక్క తండ్రి ధర్మము. ధర్మముయొక్క తండ్రి పరమాత్మయు నగును.

కొన్నిదినములు తినుటకు ఆహారము దొరుకకపోయినను ఒక్కనిమిషముకూడ పరమాత్మను మరువనివారే ధన్యజీవు లగుదురు.

ఆహారబలముతో తామసులు మనో వా క్కాయములతో చెడుపనులు చేయుచుందురు.

ఆహారబలముతో రాజసులు ఇంద్రియవిషయభోగములను సంపాదించుకొనుటకు పాటుపడుచుందురు.

అహోరబలముతో సాత్త్వికులు దైవచింతన, ప్రార్థన, పరోపకారము మొదలగు మోక్షసాధనల చేయుచుందురు.

దేహము భూమివంటిది. జ్ఞానము సూర్యునివంటిది. సూర్యుడులేనిచో భూమిపైనుండుట దుఃఖకరముగా నుండునట్లు జ్ఞానములేని ( పరమాత్మధ్యానములేని ) జీవితమున్ను అనేక బాధలతో క్లేశము నొందుచుండును.

అన్నమును తినుట, ఆత్మధ్యానమును చేయుటయును మానవధర్మ మగును.

పరమాత్మను మరచి పొట్టనుమాత్రమే పోషించుకొనుచు పెట్టెను నింపుటకు ప్రయత్నించుచుండువారు ముందుముందు అనేక తిప్పలు పడవలసివచ్చును. జాగ్రత.

## ఆకలిబాధ - అజ్ఞానబాధ

మానవులకు ఆకలిబాధ, అజ్ఞానబాధ అను రెండు బాధలు కలవుగదా !

ఆకలిబాధకంటె అజ్ఞానగుణముల ( సంకల్పముల ) వలన గలుగు బాధ మిక్కిలి దుఃఖప్రదమైనది.

ఆకలిబాధ నివృత్తికొరకు కొందరు సత్యధర్మ మార్గమున నడచుచున్నారు, అనేకులు అసత్య అధర్మ మార్గమున నడచు చున్నారు.

అన్యాయమార్గమున వర్తించి ఆకలిబాధను నివారణ చేసికొనినవారికి రోగబాధలుగాని, కలహబాధలుగాని, కామ క్రోధ భయ సంబంధమైన బాధలుగాని తప్పక వచ్చి వేధించు చుండును.

అన్యాయమార్గమున సంపాదించి బ్రతుకుటకంటె అన్నమును భుజించక భగవన్నామస్మరణతో మరణించుట మేలు.

## దేహపోషణ - ఆత్మపోషణ

దేహపోషణకు అన్నము, నీరు, వస్త్రము, గృహమును అత్యావసరమగుచున్న విధముగా, ఆత్మసుఖము చెడకుండుటకు సత్యము, ధర్మము, శాంతము, సమత్వము, ఇంద్రియనిగ్రహము, ఓర్పు, వివేకము, జపధ్యానములున్ను తప్పకయుండవలెను.

ఆహారముతో దేహమును పోషించుకొనుచున్నను, సత్ప్రవర్తనలతోను, సద్గుణములతోను పరమాత్మ సుఖమును పొందుటకు ప్రయత్నించనిచో పశుపక్ష్యాదులకును మనకును భేద మేముండును ?

దేహ మనిత్యమైనది. జ్ఞానధర్మము నిత్యమైనది. దేహము పుట్టకపూర్వమే జ్ఞానధర్మము లేర్పడియున్నవి.

జ్ఞానధర్మములను పోషించుకొను సమయములలో ఒక్కొక్కప్పుడు దేహమును పోషించకయుండవచ్చును. కాని దేహపోషణనిమిత్తము జ్ఞాన (ఆత్మ) ధర్మముల నెన్నడును తప్పరాదు.

## గృహమందు రెండు - దేహమందు రెండు

గృహమందు వంటశాల, దైవమందిరము నుండవలెను. అట్లే దేహమందు దైవచింతన, ధర్మాచరణ యుండవలెను.

వంటశాలయందు దేహపూజయు, దైవమందిరమందు దేవ గురు పూజలు, భగవద్గీతాది పారాయణయు జరుపవలెను.

ఆహారముతో దేహమును పూజించవలెను, దేహముతో గురు దైవములను పూజించవలెను, దైవచింతనతో ధర్మాచరణ కలిగియుండవలెను.

దైవ (ఆత్మ) చింతనలేనిచో ధర్మవర్తన నిలువదు, ధర్మాచరణలేనిచో దైవచింతన నిలువదు.

ధర్మాచరణ గలవారి దేహము లోకముచే గౌరవింప బడును. దైవాత్మచింతనగలవారి హృదయము వైరాగ్యము తోను సమత్వదృష్టితోను ఆనందముగా నుండును.

దైవపూజ చేయకపోవుటవలన ఈ దేహము వచ్చినది. కనుక దైవపూజ చేయుటకొరకు దేహమును పోషించవలెను. (ఆత్మచింతన, ధ్యానములచేయుటకొరకు అన్నమును తినవలెను.)

గృహము దేహపోషణకొరకు, దేహము ధర్మాచరణ కొరకు, ధర్మాచరణ పరమాత్మ దర్శనముకొరకు, పరమాత్మ దర్శనము మరల మనము పుట్టుకుండుటకొరకు నగును.

పరులను పీడించిన దేహము పాపమయమగును. పరోప కారము చేసినదేహము పుణ్యమయ మగును, పరమాత్మను భజించిన దేహము జ్ఞానమయ మగును.

లైటులేకుండ, చీకటిలో తిరుగుచున్నచో దెబ్బలుతగులు నట్లుగా, పరమాత్మను మరచి ప్రపంచములో వర్తించినచో కామక్రోధాదులచే బాధలు కలుగును.

## మానవులు క్రమముగా సంపాదించుకొనదగినవి

మొదట సకామ సత్కర్మల చేసి పుణ్యము నార్జింపవలెను. రెండవసారి నిష్కామకర్మల చేసి సుకృతమును సంపాదించుకొన

వలెను. మూడవసారి సద్గుణములను సమకూర్చుకొనవలెను. నాల్గవసారి దేవతలయొక్క, పెద్దలయొక్క యనుగ్రహమును సంపాదించుకొనవలెను. ఐదవ పర్యాయము ఇంద్రియవిషయ సుఖముల (భోగముల) పై వైరాగ్యమును సిద్ధింపజేసికొన వలెను. ఆరవతడవ నిత్యానిత్య, ఆత్మానాత్మ విచారణలు, జపధ్యానములద్వారా మనోఏకాగ్రతను సంపాదించుకొనవలెను. ఏడవ పర్యాయము మనోవాక్కాయేంద్రియములు నేను గాను, అవస్థాత్రయము (జాగ్రత్స్వప్నసుషుప్తి) లకు, స్థూల సూక్ష్మ కారణ శరీరములకు (పంచకోశములకు) ను అధిష్ఠానముగా (సాక్షిగా) యున్న తెలివి (పరబ్రహ్మము) నేను యనెడి నిశ్చయ ముతో - సోహం - శివోహం - అహం బ్రహ్మాస్మి యను మంత్ర రహస్యానుభవమును సంపాదించుకొని కైవల్యమోక్షము నొంద వలెను. ఇదే జీవిత పరమావధి. ఇదే ఋషులు, మునీశ్వరులు, యోగీశ్వరులు, మహాత్ములు, పరమభక్తులును పొందిన యను భవము.

## పుణ్యములో పాపము

1) చేతులతో భగవంతునకు, పెద్దలకును, నమస్కారము పూజ, సేవయు చేసి ఆచేతులతోనే ఇతర మానవాదిప్రాణులకు బాధకలుగు పనులను చేసినచో పుణ్యములో పాప మగును.

2) వాక్కుతో గీతాపారాయణ చేసి, భగవన్నామ సంకీర్తన స్తోత్రముల చేసి, ఇతరులకు నీతిధర్మములను చెప్పి, ఆవాక్కుతోనే అబద్ధములాడినను, అనవసరప్రసంగముల చేసినను, పరులకు కష్టము కలుగునట్లు కఠినముగా, దూషణగా మాట్లాడి నను, చాడీలు చెప్పినను పుణ్యములో పాప మగును.

3) మనస్సుతో (బుద్ధితో) జపము, ధ్యానము, విచారణ యును చేసి ఆ మనస్సుతోనే, ఇతరులపై క్రోధము, ద్వేషము, అసూయ, అహంకార మమకారముల జూపినచో పుణ్యములో పాప మగును.

4) పరులకు ధనధాన్యాదులతో ఉపకారము చేసి మరల బలవంతముగా ప్రతిఫలమును తీసికొనినచో పుణ్యములో పాప మగును.

5) గురువునకు (దేవునకు) భయపడిగాని, ఇతరులచేత అగౌరవము వచ్చునేమో యనుకొనిగాని సత్కర్మలచేయుటయు, హృదయములో కష్టపడుచు సేవచేయుటయును పుణ్యములో పాప మగును.

## అహింస - అపరిగ్రహము

అహింస యనగా పాపమును సంపాదించుకొనక యుండుట. అపరిగ్రహమనగా పుణ్యశక్తిని (తపఃఫలమును) కర్చుపెట్టుకొనక యుండుట.

సాధు సన్న్యాసులలో, భక్తులలో, వేదాంతులలో ననేకులకు అహింసావ్రతము, అపరిగ్రహవ్రతమును లేకపోవుటవలన ఇంద్రియనిగ్రహము, మనశ్శాంతి, భగవత్సాక్షాత్కారమును కలుగకయున్నది.

సుఖమును పొందగోరియు, దుఃఖము కలుగు పనులు చేయువారు ఎన్నిజన్మల నెత్తినను ఆత్మసుఖము నొందజాలరు.

గీ. చెప్పనేటికి దా నెంత శ్రేష్ఠుడైన
 కృతశుభాశుభ కర్మముల్ గెంటగలడె

కొంచెమో గొప్పయో తాము గొలుపుకర్మ
మనుభవింతురు మనుజులు నమరవరులు.

అరయగ నయాచితంబెల్ల నమృతసమము
కోరి బడసిన దంతయు నీరుసుమ్ము
తతబలాకర్షితంబు రక్తంబయగును
దగ విమర్శించి పడయు ముత్తమము నిందు.

అహింసాగుణము, అపరిగ్రహవ్రతము, గురుదైవము లందు భక్తి, వైరాగ్యము, ఆత్మస్వరూపమందు నిష్ఠయును గలవారే నిజమైన వేదాంతులు, సన్న్యాసులు, జ్ఞానులు యనబడుదురు.

## సుఖము కీర్తియు గలవారెవ రగుదురు ?

గృహములలో నున్నవారైనను, మఠములలో నున్నవారైనను, చదువు గలవారైనను ఇతరులకు బాధలేకుండ జీవితకాలము గడుపుచుండువారు సాధారణముగా సుఖవంతులు, కీర్తివంతులు నగుదురు.

ధనముతో, దేహముతో, వాక్కుతోను ఇతరులకు ఉపకారముల జేయుచుండువారు. విశేషసుఖము, కీర్తియు నొందుదురు.

పుణ్యపాపకర్మలను వదలి వైరాగ్యముతో, పరమాత్మ చింతనధ్యానములతో కాలము గడుపువారు మరింత సుఖము, కీర్తిని పొందుదురు.

పంచకోశములకు సాక్షిగాయున్న, సర్వత్రనిండియున్న, పరబ్రహ్మము తామే యను సుదృఢమైన అనుభవము నొందిన

మహనీయులు ఇహపరములందును అక్షయసుఖమును, సత్కీ-
ర్తియు నొందుదురు.

భగవంతుని మరువనివారే భగవంతునివలె పూజింప
బడుదురు.

మంచిమాటలే మంత్రములు
మంచిప్రవర్తనలే ధర్మములు
దుఃఖమును రహితమొనర్చు ప్రేమే భక్తి
భేదదృష్టిలేవి చూపే జ్ఞానము
ఇదియే అన్నిశాస్త్రముల (మతముల) సారము.



## కాలము - దాని సదుపయోగము

కాలమును సద్వినియోగపరచుటకంటే గొప్పది జీవిత
ములో మరియొకటి లేదు. నేను పుణ్యాత్ముడను కావలెననిగాని
నా జీవితము పావనమునొందవలెననిగాని ఎల్లప్పుడును కోరు
చున్న మానవుడుమాత్రమే ఒక్క నిమిషకాలమైనను వ్యర్థము
చేయక మనోవాక్కాయములతో కాలమును సదుపయోగము
చేయుచుండును.

సమస్తమును కాలమునకు లోబడియున్నది. సదుప
యోగమొనర్చినకాలముతప్ప మనలను రక్షించునది మరి
యొకటి లేదు. భగవంతుడుకూడ సదుపయోగమొనర్చిన
కాలమునకే లోబడును. కాలమును సదుపయోగము చేయ
కుండ మనము భగవంతుని గాంచలేము.

మన కర్మేంద్రియములను, జ్ఞానేంద్రియములను, అంతరింద్రియములను మరియు మనకున్న ధనాది వస్తువులను ఎల్లప్పుడున్ను పరోపకారముకొరకు, భగవత్ప్రాప్తికొరకు, మానసాదీంద్రియములు స్వాధీనమగుటకొరకు, కామ క్రోధాది గుణముల నశించుటకొరకును ఉపయోగపరచుటయే కాలమును సదుపయోగ మొనర్చుట యగును.

కాలమును ఎల్లప్పుడున్ను సదుపయోగమొనర్చు మానవునకు ప్రతిదినమును ధైర్యము, ఉత్సాహము, దైవాత్మసుఖము కీర్తియును వృద్ధియగుచుండును.

అనిత్యదేహసుఖముకొరకు కాలమును వినియోగపరచక నిత్యమైన ఆత్మదర్శనముకొరకు కాలమును ఉపయోగించువారే ప్రజ్ఞావంతులు నేర్పరులు సజ్జనులు పరమభక్తులున్ను యగుదురు "కురు పుణ్య మహోరాత్రమ్" అని శ్రీ శంకరాచార్యులు సెలవిచ్చిరి. అనగా నిద్రనుండి లేచినదిమొదలుకొని మరల నిద్రపోవువరకును పుణ్యకార్యములను చేయుచుండవలెను. కొందరు స్వప్నములోకూడ జప ధ్యానాది పుణ్యకార్యములను చేయుచుందురు.

శ్లో. నిద్రాయాం లోకవార్తాయాం శబ్దాదే రాత్మవిస్మృతే
క్వచి న్నావసరం దత్వా చింత యాత్మాన మాత్మని.

"నిద్రతోను, లోకవార్తలను చెప్పుకొనుటతోను, ఇతర శబ్దములను ఆసక్తితో వినుటతోను కాలము వ్యర్థమగును దైవాత్మను మరచిపోవుదుము. కనుక హృదయములో నెప్పుడును దైవాత్మచింతన విడువక నుండవలెను.

శ్లో. వృథాక్రియా వృథాలాపాన్ వృథావాదాన్ మనోరథాన్
త్యక్త్వైకం బ్రహ్మ విజ్ఞేయం ఇతి వేదాంతడిండిమః.

"వ్యర్థమైన పనులను, వ్యర్థమైన మాటలను, వ్యర్థమైన వాదములను, వ్యర్థమైన కోరికలను తొత్తిగా వదలిపెట్టి జప ధ్యాన విచారణలతో పరబ్రహ్మమును గాంచి ముక్తులుకావలెను." అని వేదాంతభేరీ మ్రోగుచున్నది. దుర్వినియోగపరచిన కాలము దుఃఖమును, సద్వినియోగపరచిన కాలము సౌఖ్యమును యిచ్చునని ఎన్నడును మరువరాదు. మనోవాక్కాయములతో సర్వదా సత్కర్మములను చేయుచుండుటయే కాలమును సదుపయోగ మొనర్చుట యగును. కాలమును సదుపయోగ మొనర్చిన వారిపై దైవకృపయు గురుకృపయు కలుగును. ఈ కనిపించుచున్న తోలుబొమ్మను ఎముకలగూడును చూచియే మానవులు గౌర వించుటలేదు. సదుపయోగమొనర్చిన మనోవాక్కాయములనే గౌరవించుచున్నారు.

శరీరమును, ధన ధాన్యాది వస్తువులును మనవి కావు. బంధు మిత్రాదులున్ను మనవారు కారు. సద్వినియోగ మొనర్చిన కాలమే మన దగును.

సద్వినియోగ మొనర్చు కాలముతోనే దుర్గుణములను నశింపజేసికొనవలెను. సదుపయోగమొనర్చిన కాలముతోనే మనము మోక్షసుఖము నొందవలెను. మనోవాక్కాయములతో సర్వదా సత్కర్మలను చేయు శక్తినే సాధకులు సంపాదించుకొన వలెను.



మన కర్మేంద్రియములను, జ్ఞానేంద్రియములను, అంతరింద్రియములను మరియు మనకున్న ధనాది వస్తువులను ఎల్లప్పుడున్ను పరోపకారముకొరకు, భగవత్ప్రాప్తికొరకు, మానసాదింద్రియములు స్వాధీనమగుటకొరకు, కామ క్రోధాది గుణములు నశించుటకొరకును ఉపయోగపరచుటయే కాలమును సదుపయోగ మొనర్చుట యగును.

కాలమును ఎల్లప్పుడున్ను సదుపయోగ మొనర్చు మానవునకు ప్రతిదినమును ధైర్యము, ఉత్సాహము, దైవాత్మసుఖము కీర్తియును వృద్ధియగుచుండును.

అనిత్యదేహసుఖముకొరకు కాలమును వినియోగపరచక నిత్యమైన ఆత్మదర్శనముకొరకు కాలమును ఉపయోగించువారే ప్రజ్ఞావంతులు నేర్పరులు సజ్జనులు పరమభక్తులున్ను యగుదురు. "కురు పుణ్య మహోరాత్రమ్" అని శ్రీ శంకరాచార్యులు శెలవిచ్చిరి. అనగా నిద్రనుండి లేచినది మొదలుకొని మరల నిద్రపోవువరకును పుణ్యకార్యములను చేయుచుండవలెను. కొందరు స్వప్నములోకూడ జప ధ్యానాది పుణ్యకార్యములను చేయుచుందురు.

శ్లో. నిద్రాయాం లోకవార్తాయాం శబ్దాదే రాత్మవిస్మృతే
క్వచి న్నావసరం దత్వా చింత యాత్మాన మాత్మని.

"నిద్రతోను, లోకవార్తలను చెప్పుకొనుటతోను, ఇతర శబ్దములను ఆసక్తితో వినుటతోను కాలము వ్యర్థమగును. దైవాత్మను మరచిపోవుదుము. కనుక హృదయములో నెప్పుడును దైవాత్మచింతన విడువక నుండవలెను.

శ్లో. వృథాక్రియా వృథాలాపాన్ వృథావాదాన్ మనోరథాన్
త్యక్త్వైకం బ్రహ్మ విజ్ఞేయం ఇతి వేదాంతడిండిమః.

"వ్యర్థమైన పనులను, వ్యర్థమైన మాటలను, వ్యర్థమైన వాదములను, వ్యర్థమైన కోరికలను బొత్తిగా వదలిపెట్టి జప ధ్యాన విచారణలతో పరబ్రహ్మమును గాంచి ముక్తులుకావలెను." అని వేదాంత భేరీ మ్రోగుచున్నది. దుర్వినియోగపరచిన కాలము దుఃఖమును, సద్వినియోగపరచిన కాలము సౌఖ్యమును యిచ్చునని ఎన్నడును మరువరాదు. మనోవాక్కాయములతో సర్వదా సత్కర్మములను చేయుచుండుటయే కాలమును సదుపయోగ మొనర్చుట యగును. కాలమును సదుపయోగమొనర్చినవారిపై దైవకృపయు గురుకృపయు కలుగును. ఈ కనిపించుచున్న తోలుబొమ్మను ఎముకలగూడును చూచియే మానవులు గౌరవించుటలేదు. సదుపయోగమొనర్చిన మనోవాక్కాయములనే గౌరవించుచున్నారు.

శరీరమును, ధన ధాన్యాది వస్తువులును మనవి కావు. బంధు మిత్రాదులున్ను మనవారు కారు. సద్వినియోగ మొనర్చిన కాలమే మన దగును.

సద్వినియోగమొనర్చు కాలముతోనే దుర్గుణములను నశింపజేసికొనవలెను. సదుపయోగమొనర్చిన కాలముతోనే మనము మోక్షసుఖము నొందవలెను. మనోవాక్కాయములతో సర్వదా సత్కర్మలను చేయు శక్తినే సాధకులు సంపాదించుకొనవలెను.



## సత్ప్రవర్తనలు - హృదయశుద్ధి

శ్లో. కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి ।
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే ॥

పరమాత్మసాక్షాత్కారజ్ఞానము నొందదలంచినవారు హృదయశుద్ధికొరకు శరీరముతో, వాక్కుతో, మనోబుద్ధులతో, జ్ఞానేంద్రియములతోను సత్కర్మలను నిష్కామబుద్ధితో చేయుచుండవలెను.

హృదయము శుద్ధముకానివారికి నిత్యానిత్య వస్తు వివేకము, కర్తవ్యాకర్తవ్య నిర్ణయశక్తి, ఆత్మానాత్మ వివేక జ్ఞానమును, ప్రకృతికి ప్రపంచమునకు చలించని ధీరత్వమును కలుగవు.

సత్ప్రవర్తనల (సత్కర్మల) వలన సద్గుణములు కలుగును. సద్గుణములు గలవారికి మానవాదిప్రాణులనుండి, సూర్య చంద్ర బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలనుండియు శుభాశీర్వాదములు కలుగుచుండును.

అందరియొక్క శుభాశీర్వాదముల నొందుచున్నవారి జీవితమే అభివృద్ధినొందుచు చివరకు గొప్ప మహనీయు లగుదురు.

ఎవ్వరికిని బాధకలిగించక జీవయాత్రచేయుచు అనన్య చింతనతో పరమాత్మను భజించుచుండెడి స్వభావమును మొదట అలవరచుకొనవలెను. దీనివలన హృదయములో గల దుష్ట సంస్కారములు క్రమక్రమముగా నశించుచుండును.

దుష్టసంస్కారములు నశించినపుడు సత్సంస్కారములతో పరమాత్మను పూజించుచుండెడి శక్తి సామర్థ్యములు కలుగును. పరమాత్మపూజతో జీవబ్రహ్మైక్యస్థితి కలుగును. జీవబ్రహ్మైక్య సిద్ధివలన అఖండైకరసరూపమగు సర్వాత్మభావన సుస్థిరమగును. ఇదే కైవల్యము.

## త్రికరణ ధర్మములు

### (శరీరధర్మములు)

1. ఇతర మానవాది ప్రాణులకు బాధలు కలుగు పనులను చేయకుండుట, 2. దొంగతనము చేయకుండుట, 3. కామభోగములకు లోబడకుండుట, 4. ఆడంబరమైన అలంకారములఁ జేయకుండుట, 5. ఇతరప్రాణులు బాధలు పెట్టినను తిరిగి బాధించకుండుట, 6. ఆశ, క్రోధము, లోభము, భయము లను వృద్ధిజేయు పనులలోనికి పోవకుండుట, 7. ఇతరులు చేయు సేవలకు లోబడకుండుట, 8. పరప్రాణులకు మేలు చేయుట, 9. పాదములను, చేతులను స్వాధీనములో నుంచుకొనుట, 10. శరీరమును, వస్త్రములను శుభ్రముగా నుంచుకొనుట, 11. శివ రామ కృష్ణాది దేవతలకును, గురువునకును, పెద్దలకును సేవ (పూజ) చేయుట, 12. పుణ్యతీర్థములను, ఆశ్రమములను, పెద్దలను సేవించుటకు వెళ్లుట, 13. దైవ చింతన, ధర్మవిచారణలకొరకు ఏకాంతమున నివసించుట, 14. సజ్జన సహవాసము చేయుట మొదలైనవి.

### (వాక్కుధర్మములు)

1. అసత్యమాడకుండుట, 2. కష్టము గలిగించునట్టి కఠినమైన మాటలను పలుకకుండుట, 3. చాడీలు చెప్పకుండుట

# సత్ప్రవర్తనలు - హృదయశుద్ధి

శ్లో. కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి ।
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే ॥

పరమాత్మసాక్షాత్కారజ్ఞానము నొందదలంచినవారు హృదయశుద్ధికొరకు శరీరముతో, వాక్కుతో, మనోబుద్ధులతో, జ్ఞానేంద్రియములతోను సత్కర్మలను నిష్కామబుద్ధితో చేయుచుండవలెను.

హృదయము శుద్ధముకానివారికి నిత్యానిత్య వస్తు వివేకము, కర్తవ్యాకర్తవ్య నిర్ణయశక్తి, ఆత్మానాత్మ వివేక జ్ఞానమును, ప్రకృతికి ప్రపంచమునకు చలించని ధీరత్వమును కలుగవు.

సత్ప్రవర్తనల (సత్కర్మల) వలన సద్గుణములు కలుగును. సద్గుణములు గలవారికి మానవాదిప్రాణులనుండి, సూర్య చంద్ర బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలనుండియు శుభాశీర్వాదములు కలుగుచుండును.

అందరియొక్క శుభాశీర్వాదముల నొందుచున్నవారి జీవితమే అభివృద్ధినొందుచు చివరకు గొప్ప మహానీయు లగుదురు.

ఎవ్వరికిని బాధకలిగించక జీవయాత్రచేయుచు అనన్య చింతనతో పరమాత్మను భజించుచుండెడి స్వభావమును మొదట అలవరచుకొనవలెను. దీనివలన హృదయములో గల దుష్ట సంస్కారములు క్రమక్రమముగా నశించుచుండును.

దుష్టసంస్కారములు నశించినపుడు సత్సంస్కారములతో పరమాత్మను పూజించుచుండెడి శక్తి సామర్థ్యములు కలుగును. పరమాత్మపూజతో జీవబ్రహ్మైక్యస్థితి కలుగును. జీవబ్రహ్మైక్య సిద్ధివలన అఖండైకరసరూపమగు సర్వాత్మభావన సుస్థిరమగును. ఇదే కైవల్యము.

## త్రికరణ ధర్మములు

(శరీరధర్మములు)

1. ఇతర మానవాది ప్రాణులకు బాధలు కలుగు పనులను చేయకుండుట, 2. దొంగతనము చేయకుండుట, 3. కామభోగములకు లోబడకుండుట, 4. ఆడంబరమైన అలంకారములఁ జేయకుండుట, 5. ఇతరప్రాణులు బాధలు పెట్టినను తిరిగి బాధించకుండుట, 6. ఆశ, క్రోధము, లోభము, భయము లను వృద్ధిజేయు పనులలోనికి పోవకుండుట, 7. ఇతరులు చేయు సేవలకు లోబడకుండుట, 8. పరప్రాణులకు మేలు చేయుట, 9. పాదములను, చేతులను స్వాధీనములో నుంచుకొనుట, 10. శరీరమును, వస్త్రములను శుభ్రముగా నుంచుకొనుట, 11. శివ రామ కృష్ణాది దేవతలకును, గురువునకును, పెద్దలకును సేవ (పూజ) చేయుట, 12. పుణ్యతీర్థములను, ఆశ్రమములను, పెద్దలను సేవించుటకు వెళ్లుట, 13. దైవ చింతన, ధర్మవిచారణలకొరకు ఏకాంతమున నివసించుట, 14. సజ్జన సహవాసము చేయుట మొదలైనవి.

(వాక్కుధర్మములు)

1. అసత్యమాడకుండుట, 2. కష్టము గలిగించునట్టి కఠినమైన మాటలను పలుకకుండుట, 3. చాడీలు చెప్పకుండుట

(అనగా ఇతరులపై తప్పులను కల్పించి చెప్పకుండుట), 4. వ్యర్థముగా మాట్లాడకుండుట (అనగా అనవసర ప్రసంగముల చేయకుండుట), 5. ఇతరులను ఏవస్తువునైనను, సహాయము నైనను యాచించకుండుట, 6. కపటములేక మాట్లాడుట, 7. మంచి గ్రంథములను చదువుట, 8. భగవంతుని నామమును, గురువుల నామమును కీర్తించుట (పాడుట), 9. ఇతరులకు మేలు కలుగునట్లు మాటలాడుట మొదలైనవి.

(మనోధర్మములు)

1. కోరిక, క్రోధము, లోభము, ద్వేషము, మోహము, అహంకారము, మదము, అసూయ, ఈర్ష్య, భయమున్ను లేకుండుట, 2. ఈ వస్తువులు నావి, వీరు నావారు, ఈ శరీర మనోవాక్కులు నావి యను మమకారము లేకుండుట, 3. చెడ్డపనుల లోనికి పోవుటయనిన సిగ్గును,ఓర్పును,ధైర్యమును కలిగియుండుట 4. ప్రేమ, దయ, భక్తి, కరుణయును కలిగియుండుట, 5. దైవ చింతన (జపము), ధ్యానమునుచేయుట, 6. నిత్యానిత్యముల గురించియు,ధర్మాధర్మముల (మంచిచెడ్డల) గురించియు విచారణ చేయుట, 7. పెద్దలు, శాస్త్రములున్ను చెప్పిన నీతి ధర్మములను, భక్తి జ్ఞాన వైరాగ్య ధర్మములను చింతన చేయుచు ఆచరించవలెనని నిశ్చయము చేసికొనుటయు, 8. వ్యర్థ చింతలను, నీవు నేను అను భావములను చేయకుండుట, 9. సుఖ దుఃఖములు, స్తుతినిందలు, లాభనష్టములు సంభవించినను చలించకుండుట (లోబడకుండుట, అధైర్యము నొందకుండుట), 10. ఎల్లప్పుడున్ను సంతోషముగా నుండుట, 11. ఈ ప్రపంచ నామరూపములన్నియును భగవత్స్వరూపమే, స్వాత్మరూపమే.

నని సంభావించుట, 12. ఈ దేహము నేను గాను, పరమాత్మ యే నా నిజస్వరూపమని చింతించుట, 13. శత్రువులు మిత్రులు ననుకొనుట, పుత్రులు బంధువులు యనుకొనుటయు మనశ్చల నములో గల దోషమేనని గ్రహించుట మొదలైనవి.

సారాంశము

శరీరధర్మముల ననుసరించి నడచుటవలన శరీరసంబంధ మైన పాపదోషములు నశించి దివ్యశరీరముగా మారును.

వాక్కుధర్మముల ననుసరించి నడచుటవలన వాక్సంబంధ మైన పాపములు నశించి దివ్యవాక్కుగా మారును.

మనస్సంబంధమైన ధర్మములప్రకారము మనస్సు వుండుటవలన దివ్యమైన మనస్సు యగును. ఈ విధముగా త్రికరణములును పరిశుద్ధము లైనప్పుడే స్వస్వరూపజ్ఞానము కల్గును.



## దొంగలు - దొంగతనము

దొంగతనమను విషయము సామాన్యమైనదే యని మనవా రనేకులు తలంచుచున్నారు. దొంగతనముయొక్క తత్త్వ మును తెలిసినవారు లోకములో చాలా అరుదుగా నున్నారు. అందువలననే లోకము దరిద్రముచేతను, అనారోగ్యముచేతను, కామక్రోధాది దుర్గుణములచేతను దుఃఖములో నున్నది.

దొంగతనముయొక్క తత్త్వమును గృహస్థులును, సన్న్యాసులుకూడ తెలిసికొనవలెను.

దొంగ లెచ్చటనో గలరని తలంచక గృహములలోను, మఠములలోను, హృదయములలోను గలరని గ్రహించవలెను.

భర్తకు భార్యయే దొంగగాను, భార్యకు భర్తయే దొంగగాను కనబడుచున్నది. అందువలననే వేరువేరుగా దాచుకొనుట, వేరువేరుగా తాళములను వేసికొనుటయును జరుగుచున్నది.

తండ్రికి కుమారుడు దొంగ, కుమారునకు తండ్రి దొంగ. యిట్లే తల్లికి కూతురు దొంగ, కూతురునకు తల్లియేదొ ంగ. ఈ విధముగానే గురువునకు శిష్యుడు దొంగ, శిష్యునకు గురువు దొంగ. యిట్లే యజమానునకు సేవకుడు దొంగ, సేవకునకు యజమానుడు దొంగ. యిట్లే పేదవారికి భాగ్యవంతులు దొంగలు, భాగ్యవంతులకు పేదవారు దొంగలు. యిట్లే భగవంతునకు భక్తుడు దొంగ, భక్తునకు భగవంతుడు దొంగ. ఇట్లే సద్గుణములకు దుర్గుణములు దొంగలు, దుర్గుణములకు సద్గుణములు దొంగలు.

శ్రీ గాంధీమహాత్ముడు దొంగతనమునుగురించి చెప్పిన కొన్నివాక్యములను మాత్రము యిచట తెల్పెద:

1) ఇతరుల వస్తువులను యితరులకు తెలియకగాని, అనుజ్ఞలేనిదేగాని తీసికొనుటయును, బిడ్డలకంటపడనీయక తండ్రి తినుబండములను తినుట దొంగతనమే యగును.

2) పదిమందికి హక్కుగల వస్తువులను తక్కినవారికి తెలియనీయక ఒకడు తీసికొనినను దొంగతనమే.

3) ఒకరి స్వాధీనములో నున్న వస్తువును మన కవసరము లేనప్పుడు వారి అనుమతిబొంది తీసికొనుటకూడ దొంగతనమే యగును. ఇట్టివి యెక్కువగా భోజన వస్త్రాదులలో జరుగుచున్నవి.

4) మనసునందు మనము యెవరి వస్తువునైనను సంగ్రహించవలయునను కోరిక పొడమినను, దానియందు చెడుదృష్టిని వేసినను దొంగతనమే.

5) మంచివస్తువును చూచి ఆశపడుట దొంగతనమే యగును.

6) ఉపవాస మున్నవాడు నోటితో తినకున్నను, మనస్సులో రసభోగము చేసిన దొంగతనము చేసినవాడే యగును. అతడు ఉపవాసవ్రతఫలమును పోగొట్టుకొన్నవాడే యగును.

7) బజారులో దొరికిన వస్తువును గవర్నమెంటువారి కివ్వక తాను తీసికొనుట దొంగతనమే.

8) ఆశ్రమావరణలో దొరికిన వస్తువును ఆశ్రమాధిపతికి నివ్వక తాను తీసికొనినను దొంగతనమే యగును.

9) ఇతరులు చేసిన కవిత్వమును తాను గ్రహించి ఈ కవిత్వమును నేనే చేసితినని చెప్పుట దొంగతనమే. ఇతరుల కీర్తిని తాను దొంగిలించినవా డగును. —(గాంధీ)

మహాభారతము శాంతిపర్వములో శంఖలిఖితుల చరిత్ర కలదు. దానిని సంగ్రహముగా నిట చెప్పెద:

శంఖుడును లిఖితుడును అన్నదమ్ములు. వీరు ప్రత్యేక ప్రత్యేకముగా పర్ణశాలలను నిర్మించుకొని తపస్సు చేయుచుండెడివారు. ఒకనాడు తమ్ముడు అన్నతో పనియుండికాబోలు, అన్న కుటీరమునకు వచ్చెను. అప్పుడు అన్న కుటీరములో లేడు. తమ్ముడు అన్న కుటీరము ప్రక్కనున్న పండ్లచెట్లలో ఒక చెట్టు పండును కోసెను. ఇంతలో అన్నగారు వచ్చి తమ్ముడు పండు

కోయుట చూచి, ఓ తమ్ముడా! నీవు దొంగతనము చేసితివి గాన రాజుగారిదగ్గరకు వెళ్ళి శిక్షింపబడి రమ్ము అనెను. అప్పుడు తమ్ముడు రాజువద్దకు వెళ్ళి, రాజా! నేను నా యన్న వస్తువును దొంగిలించితిని కనుక నాకు తగినశిక్ష విధించి పరిశుద్ధుని చేయుమని చెప్పగా, రాజు, స్వామీ! తమరు తపస్సంపన్నులుగాన తమను శిక్షించుట మాకు తగదు. దయయుంచి వెళ్ళుడని చెప్పెను. అప్పుడు లిఖితుడు రాజా! తప్పుచేసినవారు తాపసులైనను దండనార్హులేగాన నన్ను శిక్షించనిదే నేను వెళ్ళనని చెప్పగా రాజు బాగుగా ఆలోచించి లిఖితునియొక్క రెండు చేతులను నరికించి పంపెను. లిఖితుడు అన్నవద్దకువచ్చి చూపగా యిప్పుడు నీవు పరిశుద్ధుడవైతివని అన్నగారు పలికి ఆ నదిలో స్నానముచేసి రమ్మని చెప్పెను. అప్పుడు తమ్ముడు నదికిపోయి స్నానము చేయగానే మరల యెప్పటిచేతులు యయ్యెను.

భారతము అనుశాసనికపర్వములో సృగాల వానర సంవాదము కలదు. సృగాల (అనగా నక్క) కోతితో నేను పూర్వజన్మమున ఒకరికి ఒక వస్తువును యిచ్చెదననిచెప్పి యివ్వనందున నాకీ నక్కజన్మ వచ్చెనని చెప్పెను. ఇట్లే వానరము (కోతి) నక్కను చూచి నేను పూర్వజన్మమందు పెద్దలకు దాచిన ఫలహారములను దొంగతనముగా తినుటవలన నాకీ కోతిజన్మ కలిగెనని చెప్పెను.

మానవులు తాము కోరినది సులభముగా లభించనప్పుడు, నెరవేరనప్పుడును దొంగతనము చేయుచున్నారు. సత్యాత్మయందు, ధర్మప్రవర్తనయందును దృఢవిశ్వాసము లేనివారే దొంగతనమును చేయ నిచ్ఛగించుచున్నారు.

శ్లో. ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే స్తేనఏవ సః॥—గీత.

తా. (బ్రహ్మ జనులను చూచి చెప్పుచున్నాడు.) యజ్ఞములచేత పూజింపబడిన దేవతలు మీకు యిష్టమైన భోగములను యివ్వగలరు. అట్లు దేవతలచేత నివ్వబడిన వాటిని ఆ దేవతలకు యివ్వక, అనగా వారి ఋణమును తీర్చక యెవడు తానే అనుభవించునో అతడు దొంగ యనబడును.

దేవతలవలన, మానవాది జీవులవలనను మనకు ఆహారాదులు లభించుచున్నవి. కనుక మనము కృతజ్ఞతాపూర్వకముగా దేవతలకు, మానవాది జీవులకును ప్రీతికరమైన పనులను చేయుచు మన జీవయాత్రను సాగించుట కర్తవ్యమగును. ఇట్లు చేయనిచో మనము దొంగలమే యగుదుము.

శ్లో. ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్న వశ మాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ॥

తా. శబ్ద స్పర్శ రూప రస గంధాది యింద్రియ విషయము లన్నిటిలోను రాగమును ద్వేషమును గలవు. ఇవి వివేకియొక్క జ్ఞానమును హరింపజేయునట్టి దొంగలవలె శత్రువులుగ నున్నవి. ఇవే లోననున్న దొంగ లనబడును. ఈ దొంగలకు వశులుకానివారికే సత్యస్వరూపుడైన పరబ్రహ్మమునందు దృష్టి నిలిచి దుఃఖనివృత్తి కలుగును.

శ్లో. కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠంతి తస్కరాః।
జ్ఞానరత్నాపహారాయ తస్మా జ్జాగ్రత జాగ్రత॥

కామము, క్రోధము, లోభము అను ముగ్గురు దొంగలు జ్ఞాన మను (మోక్షసుఖమను) రత్నమును దొంగిలించుకొని

పోవుటకు ఈ దేహమునందే నివసించియున్నారు. కావున ఓ ముముక్షువులారా! ఆ దొంగలకు మీరు చిక్కక భగవంతుని సహాయముగా గైకొని వారిని చంపి ప్రకృతిరాజ్యమును స్వాధీనము చేసికొని మోక్షసామ్రాజ్య సింహాసనముపై హాయిగా నుండుడు.

శ్లో. అన్యదీయే తృణే రత్నే కాంచనే మౌక్తికేపివా।
మనసాపి నివృత్తి ర్యా తదస్తేయం విదు ర్బుధాః ॥

తా. ఇతరుల వస్తువులేవైనను అనగా గడ్డిపరకగాని, రత్నము, ముత్యము మొదలైన ధనములు యేదిన్ని యితరులకు తెలియక తీసికొనగూడదని యే యొక్క దృఢనిశ్చయము కలదో దానిని అస్తేయమని పెద్దలు చెప్పుదురు. (స్కాంద పురాణం)

శ్లో. ఆత్మనోఽనాత్మభావేన వ్యవహార వివర్జనమ్।
యత్త దస్తేయ మిత్యుక్త మాత్మవిద్భి ర్మహాత్మభిః ॥

తా. ఆత్మధ్యానమందుండి ఆత్మకంటె వేరైన కోరికలను, సంకల్పములను రానీయకుండ చేయుట అస్తేయమని ఆత్మవేత్తలైనమహాత్ములు చెప్పిరి. (స్కాంద పురాణం)

బాహ్య దొంగతనము, ఆంతర దొంగతనమును చేయకుండుట ముముక్షువుల ధర్మ మగును.

ఈ సమస్త చరాచరప్రపంచము భగవంతునిదే యగును. ఇట్టి భగవంతుని సొత్తులో దేనినైనను నాది యనుకొనుట దొంగతనమే యగును.

శ్రీ రామకృష్ణపరమహంసగారు ఒకనాడు ఔషధము కొరకు ఆసుపత్రికి వెళ్ళగా డాక్టరుగారు లేరు. కంపౌండరు

మాత్రమే యుండెను. అప్పుడు పరమహంసగారికి కంపౌండరు గారే ఔషధము నిచ్చి పంపినారు. పరమహంసగారు కొంత దూరము వచ్చినతరువాత ఓహో! నేను దొంగతనము చేసితిని గదా! డాక్టరునకు తెలియక కంపౌండ రిచ్చిన మందును తెచ్చు కొనుట తప్పేగదా యనుకొని తిరిగివెళ్ళి కంపౌండరునకు ఆ యౌషధము నిచ్చివేసి డాక్టరుగారు వచ్చినతరువాత మరల వచ్చి తీసుకొని వెళ్ళెద నని చెప్పెనట. ఓహో! అస్తేయవ్రతమును పాలించుటకూడ కష్టసాధ్యమైన పనియేగదా!

## కోరిక - క్రోధము

కోరిక యనగా సుఖమునందును లాభమునందును ప్రీతి యగును—క్రోధమనగా తనసుఖమును, లాభమును చెడగొట్టు వారిని తిట్టిగాని, కొట్టిగాని, దొంగిలించిగాని బాధపెట్టవలె నను తీవ్రమైన యిచ్ఛ యగును. కామక్రోధములు గలవారికి దేవుని పైన, ధర్మము (పుణ్యము) పైనను దృష్టి స్థిరముగా నిలువదు. కామము (కోరిక) రమ్మనును—క్రోధము పొమ్మనును. కోరిక బ్రతికించును, పోషించును—క్రోధము తిరస్కరించును, చంపును. కోరిక ప్రేమించును, స్తుతించును, సేవచేయును—క్రోధము ద్వేషించును, నిందించును, అపకారము చేయును. కోరిక సంతో షింపజేయును—క్రోధము దుఃఖపెట్టుచుండును.

కోరిక సంపాదింపజేయును—క్రోధము పారవేయు చుండును. చెడ్డకోరిక క్రోధమును, దుఃఖమును, అపకీర్తిని పెంచును. మంచికోరిక శాంతమును, ఆనందమును, కీర్తిని

వృద్ధిచేయును. చెడ్డక్రోధము దుఃఖమును, పాపమును, అపకీర్తిని కలిగించును. మంచిక్రోధము చెడ్డక్రోధమును, చెడ్డకోరికను, పాపదోషములను చంపివేయును. మంచికోరిక భగవంతుడే, ధర్మమే నాకు కావలె ననును—చెడ్డకోరిక నాకు ప్రపంచమే, సంసారమే, అధర్మములే కావలెనని యనును. కోరికతో భగవంతుని స్వరూపమును, నీతి ధర్మములను మరువకుండవలెను. క్రోధముతో ప్రపంచమును (పాపమును) మరచిపోవలెను.

కోరికతో జ్ఞానమును సంపాదించుకొనవలెను. క్రోధముతో అజ్ఞానమును హతముచేయవలెను. పాపదోషము లున్నంతవరకును మానసాదీంద్రియములు విషయములలోనికి పరుగిడుచుండును. ఈశ్వర (ఆత్మ) చింతనచే ఇంద్రియములలోగల రాగద్వేషములు నశించుచు నిశ్చలమగుచుండును. మానవులు పంచభూతములకు లోబడుచు పరమాత్మను మరచుచున్నారు. పంచభూతముల మయమగు ఇంద్రియాదులు నేను గానని చింతనచేయుటచే కామక్రోధములు నశించుచుండును.

శాంతబలము - క్రోధబలము : కొందరు శాంతముతో పనులను చేయుచుందురు. కొందరు క్రోధముతోనే పనులను చేయుచుందురు. లోకములో శాంతముకలవారికి క్రోధము గలవారు లొంగుటయును, క్రోధముగలవారికి శాంతముకలవారు లొంగుటయును కనబడుచున్నది. శాంతముతో కొన్ని సమయములందు పనులు తొందరగా నెరవేరుచున్నవి. క్రోధముతోనే కొన్ని సమయములందు పనులు తొందరగా నెరవేరుచున్నవి. అధికముగా శాంతము జూపినను మానవునకు కష్టములు వచ్చుచున్నవి. అధికముగా క్రోధము జూపినను కష్టములు వచ్చు

-చున్నవి. శాంతము క్రోధమును చంపుటకు ప్రయత్నించుచున్నది. క్రోధము శాంతమును చంపుటకు ప్రయత్నించుచున్నది. శాంతముతో దేవుని (పరమాత్మను) చూచుచుండవలెను. క్రోధముతో పరమాత్మకు అడ్డువచ్చిన గుణాదులను విధ్వంసమొనర్చుచుండవలెను. శాంతము అంతర్ముఖుని (లోనికిపోవునట్లు) చేయును. క్రోధము బహిర్ముఖుని (బయటికిపోవునట్లు) చేయును. శాంతము సుఖమును "రమ్ము" అనును క్రోధము దుఃఖమును "పొమ్ము" అనును.

1) తమోగుణస్థులు: శాంతముతో పాపమును అజ్ఞానమును దరిజేర్చు కొందురు. క్రోధముతో పాపమును అజ్ఞానమును లాగుకొనుచుందురు. 2) రజోగుణస్థులు: సంపాదింపబడియున్న భోగములను శాంతముతో అనుభవించుచుందురు. క్రోధముతో భోగములను సంపాదించుకొనుచుందురు. 3) సత్త్వగుణస్థులు: శాంతముతో దైవ (ఆత్మ) సుఖము ననుభవించుచుందురు. క్రోధముతో మానసాదీంద్రియముల (గుణముల) చాంచల్యములను చంపివేయుచుందురు. క్రోధముతో కూడిన ఆగ్రహము (పట్టుదల) కంటె శాంతముతో కూడిన ఆగ్రహము అనేకరెట్లు అచంచలమైనది (కదలకుండునది) యని చెప్పనొప్పును. గాంధీ మహాత్ముడు శాంతముతో కూడిన ఆగ్రహము (పట్టుదల) తోనే స్వరాజ్యమును సంపాదించుటయేగాక శ్రీరామచంద్రునికి పరమ భక్తుడుకూడ నయ్యెనుకదా!

క్రోధముతోకూడిన కఠినహృదయులకు దైవభక్తియు, దైవధర్మములును (జీవితధర్మములు) రుచించవు. పురుషుల హృదయముకంటె స్త్రీలహృదయము మృదువై, కోమలముగా

నుండుటచే స్త్రీలలోనే భగవద్భక్తులు, కారుణ్యస్వభావము కల వారును ఎక్కువగా కనబడుచున్నారు. క్రోధముతో కూడిన ఆగ్రహము కొంతమంది మానవులనుమాత్రమే వశము జేసికొనును. శాంతముతో కూడిన ఆగ్రహమన్ననో భగవంతునికూడ వశముచేసికొనితీరును. శాంతముతోనే హరిశ్చంద్రుడు క్రోధముతో కూడిన విశ్వామిత్రుని ఓడించెను. శాంతముతోనే పాండవులు, కౌరవులు పెట్టిన బాధలను సహించి చివరకు రాజ్యమును సంపాదింపగల్గిరి. శాంతముతోనే హృదయమును విశాలమొనర్చుకొని అందులో భగవంతుని గాంచగల్గుదుము. శాంతము సర్వేశ్వరునకు ప్రియమైనది. ప్రకృతికి-ప్రపంచమునకు చలింపనివారే శాంతాత్ము లనబడుదురు. శాంతము దురాత్ములుకూడ క్షేమము నొందుదురుగాక యని కోరుచుండును. క్రోధము మంచివారినిమాత్రమే క్షేమము నొందగోరును.

శాంతము కలవారికి సృష్టిరహస్యములు, ధర్మరహస్యములు, దైవరహస్యములున్ను గోచరించును. త్యాగముతో శాంతమును, భోగముతో క్రోధమును వృద్ధియగును. శాంతము పరమాత్మస్వరూపము, క్రోధము దేహస్వరూపము. శాంతము జలమువంటిది, క్రోధము అగ్నివంటిది. జలముచే అగ్ని చల్లారునట్లు శాంతముచే క్రోధము, దేహదృష్టి నశించును.

## కామక్రోధములు - వాటి సంతానములు

శ్లో. ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ ॥

శబ్దములలో, స్పర్శలో, రూపములలో, రసములలో, వాసనలలో యిష్టమైనవి, అయిష్టమైనవియు గలవు. మోహా-

పేక్షగలవారు, ఆత్మసాక్షాత్కారజ్ఞానము నొందదలంచువారు ఆ యిష్టానిష్టములకు (ఆ రాగద్వేషములకు) వశులు కాకూడదు. రాగద్వేషములు మోక్షమార్గమున నడువనీయక అడ్డగించునట్టి శత్రువులగును.

వివేకులు మంచివిషయములపై, మంచికర్మలపై రాగమును చెడువిషయములపై, చెడ్డకర్మలపై ద్వేషమును చూపుచు, చెడును దగ్గరకు చేరనీయక మంచిలోనే తమ జీవితమును సర్వదా నుంచుకొనుటకు ప్రయత్నించుచుందురు.

అవివేకులు చెడువిషయములపై (అనిత్యమైన విషయములపై), చెడుపనులపైని రాగము (ప్రీతి)నుంచి దైవప్రాప్తి నొందించు మంచివిషయములపై, మంచికర్మలపై ద్వేషము నుంచుదురు.

స్త్రీ పురుష రతియందు ప్రీతి, దొంగతనమునందు ప్రీతి, నిద్రయందు ప్రీతి, సోమరితనముగా కూర్చుండుటయందు ప్రీతి, శబ్దాది విషయాదులందు ప్రీతి, వ్యర్థసంభాషణయందు ప్రీతి, వ్యర్థముగా తిరుగుటయందు,వ్యర్థమైన పనులను చేయుటయందును ప్రీతి, మాంసభక్షణయందు, తినుటకు జంతువులను చంపుటయందును ప్రీతి, వస్తురూపముగాగాని, దేహసహాయరూపముగాగాని యితరులను యాచించుటయందు,తీసికొనుటయందును ప్రీతి, లాభముకొరకు అబద్ధములాడుటయందు, మోసము చేయుటయందును ప్రీతి ఇవన్నియును కామముయొక్క సంతానమగును. కనుక ముముక్షువులు తమహృదయములో గల యీ సంతానమును క్రమక్రమముగా నశింపజేసికొనవలెను.

బాధపెట్టెను (కొట్టెను)గదా యనుకొని తిరిగి బాధ పెట్టుటయందు యిచ్ఛ; దూషించుటయందు, కఠినముగా మాట్లాడుటయందును యిచ్ఛ; ద్రోహము చేసెనుగదా యనుకొని తిరిగి ద్రోహము (మోసము) చేయుటయందు యిచ్ఛ; యితరుల సుఖమునుచూచి, యితరులకువచ్చు కీర్తిని, ఐశ్వర్యమును, విద్యను చూచి ఓర్వలేకపోవుట; యితరులను ఏవిధముగానైనను చెడగొట్ట వలెనను యిచ్ఛ; యితరుల ధనాదివస్తువులను దూషించుట; యితరులు బాధలలో పడవలెనను యిచ్ఛతో అబద్ధములాడుట; యితరులను కష్టపెట్టుటకే వారి వస్తువులను అపహరించుట; ఇతరులపై చాడీలు చెప్పుట (దోషారోపణచేయుట) ఇవన్ని యును క్రోధముయొక్కసంతాన మగును. కనుక ముముక్షువులు, భక్తులు యీ సంతానమును హృదయములో నుండనీయక నశింపజేసికొని సుఖించవలెను.

జప ధ్యానాది సత్కర్మలన్నియును, ఆధ్యాత్మిక జ్ఞాన సాధనలన్నియును కామక్రోధములు నశించుటకును,ఆత్మదర్శనము నొందుటకును యేర్పడినవని సాధకులు గ్రహించవలెను. త్యాగమును హృదయములో నిల్పుకొని కామమును వదల వలెను. ఇట్లే ప్రేమను హృదయములో స్థాపన జేసికొని క్రోధమును నశింపజేసికొనవలెను.

మానవులకు కామక్రోధములతో దుఃఖము లెన్నియో కలుగును. త్యాగప్రేమలతోనే జీవితము సుఖించును. అహం కారమను ముడినుండియే కామక్రోధములు పుట్టుచుండును.

గాలిలో నుంచిన కర్పూరపుముద్ద క్రమక్రమముగా హరించిపోవునట్లుగా నిత్యానిత్యవిచారణతో కూడిన ఆత్మ

(దైవ) ధ్యాన మను గాలితోనే అహంకార మను కర్పూరపు ముద్ద హరించిపోవును. కర్పూర మున్నంతవరకు వాసనకూడ యుండునట్లు అహంకారము ఉన్నంతవరకును కామక్రోధము లుండును.

కొంగ నీటిలో గబగబ నడచుచు, ఎగురుచు చేపలను పట్టజాలదు. బహునెమ్మదిగా నడచుచుగాని, నిలబడిగాని యున్నమాత్రమే చేపలు దొరకును. ఇట్లే హృదయములో కామ క్రోధ లోభ అహంకారాది గుణములతో చలనమున్నంత వరకును సత్య ధర్మ శాంత్యాది సద్గుణము లను మత్స్యములు మనకు లభించవు.

పామరులలోని అజ్ఞానగుణములను, ప్రవర్తనలను గుర్తించి తాను తీసికొనకుండుటయు, పెద్దలలోగల జ్ఞానగుణములను తెలిసి కొని తాను తీసికొనుచు ఆచరించుటయును జీవితము పవిత్ర మగుటకు ముఖ్యసూత్ర మగును.

భగవన్నామస్మరణను ఎల్లప్పుడును మరువక చేయుట యను నొక్కసాధన యుండిన కామక్రోధాది ప్రకృతిగుణములను జయించవచ్చును.

పరమాత్మయే మన గమ్యస్థానమని గ్రహించి పరమాత్మ యందే దృష్టినుంచి మనస్సును నిగ్రహించుటయే సమస్తశాస్త్ర ములయొక్క సార మగును.

మితసంభాషణ, దైవచింతన యున్న మానవునిదగ్గరకు సమస్త సద్గుణములును స్వయముగా వచ్చి చేరును.

కౌరవులు పుణ్యకర్మఫలమగు భోగముల ననుభవించుచు పాపకార్యములను చేసిరి. పాండవులు పాపకర్మఫలమగు కష్టము

అనుభవించుచు పుణ్యకార్యములను చేసిరి. ఇదే వివేకము లేని వారికిని వివేకము గలవారికిని గల భేదము.

చదివినది, వినినది, చూచినది, నేర్చుకొనినది, చేసినదియును మరచిపోయి ఆత్మస్థితుడై యుండుటయే సమాధియు, మోక్షము నగును.

కడుపునొప్పితో మిక్కిలి బాధపడువానికి ప్రపంచ వినోదములు రుచించనట్లు నిజమైన ముముక్షువులకును, భక్తులకును ప్రపంచ విషయభోగములు రుచించవు.

## గీతను పఠింపనేర్చుట పాండిత్యమా ?

గీతలో గల శ్లోకములను తప్పులు లేకుండగా చదువుట గీతను నేర్చుకొనుటకాదు. గీతోపన్యాసము లిచ్చు శక్తిని సంపాదించుకొనుట పాండిత్యముగాదు. గీతలోగల జ్ఞానధర్మములను ఆచరించగలుగుటయే గీతను నేర్చుకొనుట యగును. గీతా ధర్మములు అనుభవమునకు వచ్చుటయే పాండిత్య మగును.

ఒక కథ చెప్పెద : ధర్మరాజులవారు బాల్యమున విద్య నభ్యసించునపుడు ఉపాధ్యాయులు ఒకనాడు ఒక పాఠము నిచ్చిరి. మరునాడు తోడిబాలురందరు పాఠము నప్పజెప్పిరి. క్రొత్తపాఠములను నేర్చుకొనుచు నిట్లు చాలదినములు గడచినను ధర్మరాజు తన కింకను మొదటిపాఠమే చక్కగా రాలేదని చెప్పుచుండుటచే గురువులవారు కోపము గలవారై కఠినముగా కొట్టిరి. ఎంతకొట్టినను ఆ బాలుడు కంట తడియైనను బెట్టకుండుటచే ఆయన మిగుల నాశ్చర్యము నొంది అందులకు

కారణము నడిగెను. అప్పు డా బాలుడు, అయ్యా! మీరు నా కిచ్చిన పాఠమున రెండు మాటలు గలవు. ఒకటి "సత్యమును పలుకుము," రెండవది "ఓర్పు గలిగియుండుము." అందులో మొదటిది పూర్ణముగా నభ్యసించితినిగాని రెండవది పూర్ణముగా నభ్యసింపనై తిని. ఏలయనగా మీరు నన్ను కొట్టినపుడు మొదట నోర్చుకొంటినిగాని నెత్తురువచ్చినపిదప నోర్చుకొనలేకపోతి నని చెప్పెను. గురువు యా బాలుని జ్ఞానవికాసమునకు ఆశ్చర్యము నొంది తన మూర్ఖత్వమునకు విచారము నొంది నాకు యింకను మొదటివాక్యమే బోధపడలేదని చెప్పి యా బాలుని ముద్దు పెట్టుకొని నీవే నా గురువువై యుండుట కర్హుడ వనెను.

గీతాపాఠకులారా! ఈ కథవలన పఠనరహస్యము తెలిసినదిగదా, కనుక

(1) ఇతర మానవాది జీవులకు అపకారము చేయక ఉపకారము చేయుట నేర్చుకొనవలెను.

(2) లోభగుణమును వదలి దానము చేయుట నేర్వవలెను.

(3) కోరికలను వదలి నిష్కామముగా నుండుట నేర్వ వలెను.

(4) క్రోధమును వదలి శాంతముతో నుండుట నేర్చు కొనవలెను.

(5) విషయభోగములపై గల ప్రేమను భగవంతునిపై నుంచుట నేర్వవలెను.

(6) కర్మేంద్రియములను చంచలముగా నుండనీయక స్వాధీనములో నుంచుట నేర్వవలెను.

5

అనుభవించుచు పుణ్యకార్యములను చేసిరి. ఇదే వివేకములేని వారికిని వివేకము గలవారికిని గల భేదము.

చదివినది, వినినది, చూచినది, నేర్చుకొనినది, చేసినదియును మరచిపోయి ఆత్మస్థితుడై యుండుటయే సమాధియు, మోక్షము నగును.

కడుపునొప్పితో మిక్కిలి బాధపడువానికి ప్రపంచ వినోదములు రుచించనట్లు నిజమైన ముముక్షువులకును, భక్తులకును ప్రపంచ విషయభోగములు రుచించవు.

## గీతను పఠింపనేర్చుట పాండిత్యమా ?

గీతలో గల శ్లోకములను తప్పులు లేకుండగా చదువుట గీతను నేర్చుకొనుటకాదు. గీతోపన్యాసము లిచ్చు శక్తిని సంపాదించుకొనుట పాండిత్యముగాదు. గీతలోగల జ్ఞానధర్మములను ఆచరించగలుగుటయే గీతను నేర్చుకొనుట యగును. గీతాధర్మములు అనుభవమునకు వచ్చుటయే పాండిత్య మగును.

ఒక కథ చెప్పెద : ధర్మరాజులవారు బాల్యమున విద్యనభ్యసించునపుడు ఉపాధ్యాయులు ఒకనాడు ఒక పాఠము నిచ్చిరి. మరునాడు తోడిబాలురందరు పాఠము నప్పజెప్పిరి. క్రొత్తపాఠములను నేర్చుకొనుచు నిట్లు చాలదినములు గడచినను ధర్మరాజు తన కింకను మొదటిపాఠమే చక్కగా రాలేదని చెప్పుచుండుటచే గురువులవారు కోపము గలవారై కఠినముగా కొట్టిరి. ఎంతకొట్టినను ఆ బాలుడు కంట తడియైనను బెట్టకుండుటచే ఆయన మిగుల నాశ్చర్యము నొంది అందులకు

కారణము నడిగెను. అప్పు డా బాలుడు, అయ్యా! మీరు నా కిచ్చిన పాఠమున రెండు మాటలు గలవు. ఒకటి "సత్యమును పలుకుము," రెండవది "ఓర్పు గలిగియుండుము." అందులో మొదటిది పూర్ణముగా నభ్యసించితినిగాని రెండవది పూర్ణముగా నభ్యసింపనైతిని. ఏలయనగా మీరు నన్ను కొట్టినపుడు మొదట నోర్చుకొంటినిగాని నెత్తురువచ్చినపిదప నోర్చుకొనలేకపోతి నని చెప్పెను. గురువు యా బాలుని జ్ఞానవికాసమునకు ఆశ్చర్యము నొంది తన మూర్ఖత్వమునకు విచారము నొంది నాకు యింకను మొదటివాక్యమే బోధపడలేదని చెప్పి యా బాలుని ముద్దు పెట్టుకొని నీవే నా గురువువై యుండుట కర్హుడ వనెను.

గీతాపాఠకులారా! ఈ కథవలన పఠనరహస్యము తెలిసినదిగదా, కనుక

(1) ఇతర మానవాది జీవులకు అపకారము చేయక ఉపకారము చేయుట నేర్చుకొనవలెను.

(2) లోభగుణమును వదలి దానము చేయుట నేర్వవలెను.

(3) కోరికలను వదలి నిష్కామముగా నుండుట నేర్వ వలెను.

(4) క్రోధమును వదలి శాంతముతో నుండుట నేర్చు కొనవలెను.

(5) విషయభోగములపై గల ప్రేమను భగవంతునిపై నుంచుట నేర్వవలెను.

(6) కర్మేంద్రియములను చంచలముగా నుండనీయక స్వాధీనములో నుంచుట నేర్వవలెను.

(7) శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయములకు లోబడక నుండు విధమును నేర్వవలెను.

(8) ప్రపంచమును భయపెట్టకుండుట, ప్రపంచమునకు భయపడకుండుటను నేర్వవలెను.

(9) స్తుతినిందలకును, సుఖదుఃఖములకును చలించని స్థితి గల్గు విధమును నేర్చుకొనవలెను.

(10) చంచలమైన మనస్సును నిశ్చలముగా జేసి దైవాత్మ యందే దృష్టి నుంచు విధమును నేర్వవలెను.

(11) అహంకార మమకారములను వదలి కర్మలను చేయు విధమును నేర్చుకొనవలెను.

(12 అసత్యముగా, కఠినముగా మాట్లాడెడి వాక్కును సత్యముగాను, ప్రియముగాను, హితముగాను యుండి మాట్లాడెడి విధమును నేర్వవలెను.

(13) నానా భేదములుగా కనిపించుచున్న ఈ ప్రపంచ మును ఏకైకపరబ్రహ్మమయముగా గాంచెడి విధమును నేర్చు కొనవలెను.

(14) దేహమే నేను యను భావమును వదలి ఆత్మయే నేను యను దృఢజ్ఞానము కలుగు విధమును నేర్వవలెను.

కొందరు యాత్రికులు, గృహస్థులు మొదలైనవారు తమ శరీరమునకు రోగములు వచ్చినప్పుడు సేవించుటకుగాను కొన్ని ఔషధములను సమకూర్చి యుంచుకొనెదరు. రోగములు వచ్చినప్పుడు ఆ యౌషధములను సేవించనిచో సమకూర్చిన ఫలము లేదుగదా. ఇట్లే గీతాది సద్గ్రంథములను చదివి

సద్ధర్మములను తెలిసికొనియును ఆ యా సమయములలో ఆ యా ధర్మములను ఉపయోగించుకొననిచో చదివి తెలిసికొనిన ఫల మేమియు నుండదని పాఠకులు గ్రహించవలెను.

శ్లో. యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః ॥
అ : 4. శ్లో : 19.

తా. ఎవడు తాను చేయు సమస్తపనులను ఫలాభిలాష లేకుండగా చేయుచున్నాడో, జ్ఞానమను అగ్నిచేత కోరికలను నశింపజేసికొనిన ఆ మానవుని పండితుడని పెద్దలు చెప్పుచున్నారు.

శ్లో. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః ॥ అ : 5. శ్లో:18.

తా. విద్య, శాంతము వీటితోకూడిన సాధువులయందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్కనువండి భుజించునట్టి చండాలునియందును పండితులు సమత్వబుద్ధి కలిగి యుందురు.

ఈ గీతా శ్లోకములలో గల పాండిత్యమును మనము కలిగి యున్నామా, లేదా ? యని గీతాపాఠకులు పరీక్షచేసికొనవలెను.

ఇతరగ్రంథములలో గల పాండిత్యలక్షణములనుకూడ తెలిపెద :

శ్లో. పఠకాః పాఠకాశ్చైవ యే చాన్యే శాస్త్రచింతకాః ।
సర్వే వ్యసనినో మూఢాః యః క్రియావాన్ స పండితః ॥

తా. చదువువారు, చదివించువారు, శాస్త్రములను మననము చేయువారు వీరందరున్ను పఠనాది వ్యసనములు గల

మూఢులే యగుదురు. చదువుకొనినది, చదివించినది, శాస్త్రముల లోనిది, మననము చేసినదియు ఆచరణలో పెట్టువాడే పండితు డనబడును.

శ్లో. న రణే విజయా చ్ఛూరో౽ధ్యయనా న్న చ పండితః।
న వక్తా వాక్పటుత్వేన న దాతా చార్థదానతః॥

తా. యుద్ధమున జయించినవాడు శూరుడుకాడు. శాస్త్రములను చదివినంతమాత్రమున పండితుడుకాడు. వాక్పటిమ గలవాడు వక్తకాడు. ధనమును దానము చేసినంత మాత్రమున దాతకాడు.

శ్లో. ఇంద్రియాణాం జయే శూరో ధర్మశ్చరతి పండితః।
హితప్రాయోక్తిభి ర్వక్తా దాత సమ్మానదానతః॥
(వ్యాసస్మృతి)

తా. ఇంద్రియములను జయించినవాడే శూరుడు. సత్య ధర్మాచరణ గలవాడే పండితుడు. ఇతరులకు సద్ధర్మములను చెప్పువాడే వక్త. ఇతరులను ప్రేమతో గౌరవించువాడే దాత యనబడును.

శ్లో. సత్యం తపో జ్ఞాన మహింసతా చ
విద్వత్ప్రణామశ్చ సుశీలతా చ।
ఏతాని యో ధారయతే స విద్వాన్
న కేవలం యః పఠతే స విద్వాన్॥

తా. సత్యము, తపస్సు, జ్ఞానము, అహింసాగుణము, పెద్దలను గౌరవించు బుద్ధి, సదాచారమును ఎవడు కలిగి యుండునో అతడే పండితు డనబడును. శాస్త్రములను చదివినంత మాత్రమున పండితుడు కానేరడు.

శ్లో. న పాణి పాదచపలో న నేత్రచపలో యది ।
న చ వాక్చపలశ్చైవ ఇతి శిష్టస్య లక్షణమ్ ॥

తా. వ్యర్థమైన పనుల చేయుట, వ్యర్థముగా తిరుగుట, వ్యర్థముగా నటు నిటు చూచుట, వ్యర్థముగా మాట్లాడుటయు నెవనికి లేవో అతడే పండితు డనబడును (పండిత లక్షణ మిదే).

శ్లో. మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం ।
మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యత్ దురాత్మనామ్ ॥

తా. మహాత్ములకు మనస్సునందు ఒకటే, వాక్కునందు ఒకటే, కర్మయందును ఒకటే యుండును. దుష్టులైనవారికి మనస్సునందు వేరొకటి, వాక్కునందు వేరొకటి, కర్మయందు వేరొకభావ ముండును. అనగా పండితులు నిష్కపటహృదయముతో ప్రవర్తింతురనియు, దుర్మార్గులు కపటహృదయులై మోసపుభావముతో ప్రవర్తింతురనియు తాత్పర్యము.



## చెప్పువా రందరు జ్ఞానులేనా ?

శ్లో. అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః ॥

తా. నీవు ప్రజ్ఞావంతులు చెప్పెడి జ్ఞానవాక్యములను చెప్పుచుండియును దుఃఖింపతగని విషయములగురించి దుఃఖించుచున్నావు. ఆత్మానుభవముగల జ్ఞానులు జరిగిన విషయముల గురించియు, జరుగబోవు విషయములగురించియు, జరుగుచున్న విషయములగురించియును దుఃఖమును, భయమును పొందరు.

ఈ శ్లోకములో సగము అజ్ఞాని లక్షణమును (వాచా వేదాంతి లక్షణమును), తక్కిన సగము అనుభవజ్ఞానముగల మహాత్ముని లక్షణమును గురించియును చెప్పబడినది. ఈ శ్లోకములో గీతయొక్క సారమంతయు నిమిడియున్నది. కనుక మనకు అజ్ఞానలక్షణము లున్నవా, జ్ఞానలక్షణము లున్నవా? యని ఎవరికివారే పరీక్షచేసికొని జ్ఞానసాధనల చేయుచుండవలెను.

అరటిపండును ఒలిచి చేతిలో పెట్టినట్లుగా సులభముగా కమ్మని జ్ఞానధర్మములను చెప్పువారిని చూచి వీరు అనుభవజ్ఞానముగల మహాత్ములే యని మనవారిలో అనేకులు తలంచి భ్రమలో మునుగుచున్నారు. ఇట్టి భ్రాంతచిత్తులకు భవిష్యత్తులో అనేక చిక్కులు సంభవించును.

అనేకజన్మలనుండి వచ్చుచున్న విషయసంస్కారములు (వాసనలు, సంకల్పములు) హృదయములో పాదుకొనియుండును. అవియన్నియును పూర్తిగా నశించినప్పుడే స్వస్వరూపమైన పరమాత్మ ప్రత్యక్షమగునని మహాత్ములందరును స్వానుభవముతో చెప్పుచున్నారు.

సూర్యుని వేడికిరణములతో మంచుతుంపురులు నశించునట్లు, వైరాగ్య మవలంబించి యెల్లప్పుడును సత్యమైన దైవాత్మ చింతన చేయుచున్నమాత్రమే హృదయములోగల విషయవాసనలు నశించి ఆత్మదర్శన మగును.

1) దేహ ధనాది రూపములు అనిత్యమైనవని అనేకులు చెప్పుచున్నారుగాని వాటిపైగల మోహమును నశింపజేసికొని సుఖించువారు మిక్కిలి తక్కువమందే కలరు.

2) నేను, నాది యను అహంకార మమకారము లుండ రాదని చెప్పువారు అనేకులున్నారు గాని వాటిని వదలి ప్రవర్తించు వారు కొద్దిమందే కలరు.

3) కోరికలు (ఆశలు) ఉండరాదని అనేకులు చెప్పు చుందురుగాని వాటిని నశింపజేసికొన్నవారు బహు తక్కువ మందే గలరు.

4) క్రోధముండరాదని చాలమంది చెప్పుచున్నారుగాని శాంతముతో సుఖించువారు అరుదుగానే యున్నారు.

5) ఇతర మానవాది ప్రాణులకు బాధలు కలిగించక జీవిత మును గడపుట పరమధర్మమని బోధించువారు అనేకులు కలరు కాని చెప్పినట్లు నడచువారు మిక్కిలి తక్కువమందే కలరు.

6) అబద్ధములు చెప్పరాదని అనేకులు చెప్పుచున్నారు కాని సర్వదా సత్యమునే చెప్పువారు తక్కువగా నున్నారు.

7) అందరిలోను, అంతటను భగవంతుడు నిండియున్నాడని చాలమంది చెప్పుచున్నారుగాని అంతటను భగవంతుని సర్వదా గాంచువారు బహుకొద్దిమందే కలరు.

8) సర్వకాల సర్వావస్థలయందును భగవంతుని విడువక భజించవలెనని అనేకులు చెప్పుచున్నారు. కాని అట్లు భజించుచు చెప్పువారు తక్కువమందే కలరు.

9) దేహ ధనాది సమస్తమునున్నూ దేవునకును, గురువు నకును అర్పించివేసినవారికే మోక్షము కలుగునని అనేకులు చెప్పు చున్నారు. కాని దేహ ధనాదుల పైగల అహంకార మమకారములు లేనివారు కొద్దిమందే కలరు.

10) మనమందరమును దేవుని బిడ్డలమని, ఋషిసంతాన మేనని గ్రహించి సోదరభావముతో,అభేదదృష్టితో మెలగవలెనని చెప్పువా రనేకు లున్నారు. కాని భేదబుద్ధి నశించినవారు కొద్దిమందే కలరు.

11) మనోబుద్ధిచిత్తాహంకారములు, కామక్రోధాది గుణములు, స్తుతినిందలు, సుఖదుఃఖాదులు లేని పరబ్రహ్మమే నేను యని చెప్పుకొనువారు బహుమంది కలరుగాని స్తుతినిందాది ద్వంద్వములకు చలించక పరబ్రహ్మదృష్టితో నున్నవారు మిక్కిలి అరుదుగా నున్నారు.

12) ఉపనిషద్గీతాది గ్రంథములలో జ్ఞాన ధర్మములను (మోక్షధర్మములను) వెదకి తెలిసికొనినవా రనేకులు కలరుగాని హృదయములోగల అజ్ఞానగుణములను తొలగించి జ్ఞానగుణములను వెదకి అనుష్ఠించువారు తక్కువమందే కలరు.

13) పుచ్చుకొనువారు (తీసికొనువారు) చాలమంది కలరుగాని యిచ్చువారు కొలదిమందే యున్నారు.

చేయువారికన్నను చెప్పుచు కాలము గడపువా రనేకులు ఉండుటవలననే లోకము దరిద్రముతో, ద్వేషభావములతో, అజ్ఞానముతోను మునిగి మూలుగుచున్నది.

గతించినవారినిగురించియు, ఉన్నవారినిగురించియును జ్ఞానులు దుఃఖపడరని శ్లోకములో జెప్పబడినదిగదా. గతించని వారినిగురించి దుఃఖ మెట్లు కలుగును? అని ప్రశ్నించువారు కొందరు కలరు. ఇందుకు సమాధాన మేమన: ప్రేమచేతను, విరోధముచేతను ఉన్నవారినిగురించి దుఃఖములు కలుగునని గ్రహించవలెను. ఎట్లనగా యిష్టమైనవారు చనిపోయినను,

వారికి రోగాది బాధలు వచ్చినను మనకు దుఃఖము వచ్చుచున్నది గదా. ఇట్లే మనలను బాధపెట్టువారున్నను మనకు దుఃఖము కలుగుచున్నదిగదా.

దుఃఖములు మూడువిధములుగా వచ్చునని చెప్పవచ్చును. ఎట్లన :

1) పోయెనుగదా : పుత్రమిత్రాదులు, ధనాది వస్తువులు, కీర్తి, ఆరోగ్యము, మనశ్శాంతి మొదలైనవి.

2) బాధించుచుండెనుగదా : విరోధులు, అపకీర్తి, అనారోగ్యము, కామక్రోధాది గుణములు మొదలైనవి.

3) కలుగలేదుగదా : పుత్రులు, శిష్యులు, ధనాది వస్తువులు, కీర్తి, ఆరోగ్యము, శమ దమాది సద్గుణములు, ఆత్మ శాంతి (దైవదర్శనము) మొదలైనవి.



## వాక్కుయొక్క సామాన్య ధర్మములు

1) ఇతరులతో ఇచ్చెదననకుము. ఇవ్వవలెనని యున్నదినుము. (ఎందుచేతననగా ఇచ్చుటకు వీలుపడదేమో)

ఇవ్వననకుము యివ్వవలెనను తలంపు లేదనుము. (ఎందు చేతననగా బలవంతముగానైనను యివ్వవలసిన పరిస్థితి వచ్చునేమో)

2) వచ్చెద ననకుము. రావలెనని యున్నదనుము.

రానని యనకుము. రావలెననితలంపు లేదనుము.

3) చెప్పెద ననకుము. చెప్పవలెనని యున్నదనుము. చెప్పనని యనకుము. చెప్పుటకు యిష్టము లేదనుము.

4) చేసెద ననకుము. చేయవలెనని యున్నదనుము. చేయను అని అనకుము. చేయుటకు ఇష్టము (తలంపు) లేదనుము.

5) ఉండెద ననకుము. ఉండవలెనని యున్నదనుము. ఉండను అని యనకుము. ఉండుటకు యిష్టము (తలంపు) లేదనుము.

6) చూచెద ననకుము. చూడవలెనని యున్నదనుము. చూడ ననకుము. చూడవలెనను తలంపు లేదనుము.

7) తీసికొనెద ననకుము. తీసికొనవలెనని యున్న దనుము.

తీసికొనను అని యనకుము. తీసికొనవలెనను తలంపు (యిష్టము) లేదనుము.

8) తెచ్చెద ననకుము. జ్ఞాపకము, అవకాశము యున్న తెచ్చెద ననుము.

తీసికొనిరానని యనకుము. తెచ్చుటకు యిష్టము (తలంపు) లేదనుము.

9) ఈ వస్తువు మంచిది యనకుము. ఇది నాకు మంచిదిగా కనబడుచున్నదనుము.

10) నేను చేయు పనియే మంచి దనకుము. నాకీ పని యిష్టమైనదగుటచేత చేయుచుంటి ననుము.

11) నీవు చేయుపని మంచిది కాదనకుము. నీపని నాకు మంచిదిగా కనబడుటలేదనుము.

12) నేను చెప్పినదే సత్య మనకుము, నేను చెప్పినది మంచిదని తోచి చెప్పితి ననుము.

13) నీవు చెప్పినది మంచి కాదనకుము. నీ మాట మంచిదిగా నాకు కనబడుట లేదనుము.

14) వారు మంచివా రనకుము. వారు నాకు మంచి వారుగా కనబడుచున్నా రనుము.

15) వీరు మంచివారు కాదనకుము. వీరు మంచివారుగా నాకు కనబడుట లేదనుము.

16) నా గురువే గొప్పవా రనకుము. నా గురువునందే నాకు భక్తి నిలిచియున్న దనుము.

17) నా గురువు చెప్పిన ధర్మములే గొప్పవనకుము. నా గురువు చెప్పిన ధర్మనియమములే నాకు యిష్టమైనవనుము.

18) నా దేవుడే గొప్పవాడనకుము. నే నీ దేవునే నమ్మి యుంటి ననుము.

19) నీ దేవుడు గొప్పవాడు కాదనకుము. నీ దేవునిపై నాకు ప్రేమ లేదనుము.

20) నీ శరీరముతో యితరుల దేహమును గాయ పరచకుము. నీ వాక్కుతో యితరుల హృదయమును గాయ పరచకుము.

21) కామము గల్గుమాట, క్రోధము గలుగుమాట, భయము, దుఃఖము గల్గుమాట, నీతి ధర్మము లేనిమాటలను మాట్లాడకుము.

22) మనస్సును పరమాత్మవైపునకు త్రిప్పునట్టి గట్టి మాటలనే మాట్లాడుము.

(23) నావలన ఇతరులకు బాధ కలుగలేదనియు, నేను బాధ కలిగించలేదనియు ననకుము. బాధకలుగుచున్నదేమో, కలిగించితినేమో యనుము.

(24) నాలో దుర్గుణము లేవియును లేవని చెప్పుకొనక నాలో దుర్గుణములు చాలా కలవని చెప్పుకొనుము.

(25) నేను భగవంతుని ఒక్కనినే నమ్ముకొనియుంటి ననియు, భగవంతు నొక్క నిమిషముకూడ మరువ ననియును యితరులతో చెప్పుకొనుచుండకుము.

(26) నాకు దేనియందును ఆశలేదు. నాలో కోరికలు, కోపము, భయమును లేవు యని చెప్పుకొనకుము.

(27) జ్ఞానముతోనుండి నేను అజ్ఞాని నని చెప్పుకొనినను దోషము లేదు. కాని అజ్ఞానములోనుండి జ్ఞాని నని చెప్పుకొనుట పెద్దదోష మగును.

28) వాక్కుతో భగవంతు నొక్కనినే నమ్మియుంటినని చెప్పుచు, మనస్సులో బంధుమిత్రాదులను, ధనాది వస్తువులను, ఆధారము చేసికొని యుండకుము.

29) మొదట నీవు ప్రపంచ (సంసార భ్రాంతులను వదలుము. రెండవసారి శరీరభ్రాంతిని వదలుము. మూడవసారి

కామ క్రోధాది గుణములతో యున్న మనస్సును వదలిపెట్టుము. వాల్గవసారి పరమాత్మ (దేవుని) పట్టుకొని యుండుము. యిదే నీవు ధ్యాననిష్టకొరకు కూర్చొని చేయవలసిన పని.

30) సంసారులకు ప్రియముగా నడచి, అన్న వస్త్రములను సంపాదించుకొనుము. సన్న్యాసులకు (గురువులకు) ప్రియము గలుగునట్లు నడచి అమృతమును సంపాదించుకొనుము.



## దుఃఖనివృత్తికి, ఆనందప్రాప్తికి నే నెట్లు నడువవలెను ?

ఒంటరివిగా నుండుము. నీ కర్మేంద్రియములను, జ్ఞానేంద్రియములను వశమునం దుంచుకొనుము. నీ మనస్సును బాహ్యవిషయములపైకి పోనీయక సర్వదా పరమాత్మ చింతన చేయుచు నుండుము. నీకు స్వంతయాస్తి యున్న యెడల దానితో జీవించుము. లేనియెడల ఇతరులు స్వయముగా తీసికొనివచ్చి పెట్టినచో దానితో జీవించుము. పెట్టమని చేయి చాచకుము. వాక్కుతో అడుగకుము. అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుడైన పరమాత్ము నొక్కనినే నమ్మి భజించుచుండుము. అల్పమానవాది జీవులపై ఆధారపడి యుండకుము.

ఈ చెప్పినవిధముగా మనస్సును ఎల్లప్పుడును నిగ్రహించుచు నుండలేనియెడల సజ్జనులదగ్గర నుండి వారు చెప్పినట్లు నడచుకొనుచుండుము.

ఇదియు చేయజాలవేని న్యాయమైన ఒక వృత్తిని ఏర్పాటు చేసికొని ధనమును సంపాదించి శరీరమును పోషించుకొనుచు

భగవన్నామసంకీర్తన, జప ధ్యానాది సత్కర్మల చేసికొనుచు పరులను ఏరూపముగాను బాధపెట్టక ప్రవర్తించుచు కాలమును గడపుచుండుము.

ఇదియు చేయజాలవేని తల్లిదండ్రి భార్యాబిడ్డలు బంధుమిత్రాదులను అండగానుంచుకొని, సాధ్యమైనంతవరకు న్యాయముతప్పక ధనమును సంపాదించుచు, మధ్య మధ్య భగవన్నామసంకీర్తన, సద్గ్రంథపఠన, జప ధ్యానములను చేయుచు అపుడపుడు పెద్దలదగ్గరకు వెళ్లుచునుండుము.

ఇదియున్ను చేయజాలవేని భిక్షమెత్తుకొని భుజించుచు, పుణ్యక్షేత్ర, పుణ్యాశ్రమ, పుణ్యాత్ములను, దేవతామూర్తులను, పుణ్యనదీ నదములను సేవించుచు, పుణ్యకార్యములు జరుగుచున్న స్థలములకు వెళ్లుచుండుము. ధనమును ముట్టకుము. నీ మానసేంద్రియములు స్వాధీనమగువరకును, కోరికలు నశించువరకును పరమాత్మ నొక్కనినే నమ్మి భజించుశక్తి వచ్చువరకును కాలినడకతో యాత్ర చేయుచుండుము.

## సాక్షాత్కారానుభవములు

మొదట నీవు ఇతరులలోగల (ఇతరులు చేయు క్రియలలో గల) పుణ్యమును, పాపమును, సాక్షాత్కారము చేసికొనుము. తరువాత నీ శరీరములో (నీవు చేయు పనులలో, మాట్లాడే మాటలలో) గల పుణ్యమును, పాపమును, అనగా ధర్మాధర్మములను సాక్షాత్కారము చేసికొని అధర్మ (పాపపు) క్రియలను వదలివేయుము. ఇట్లే

ఇతరులలోగల, సద్గుణములను, దుర్గుణములను, మొదట సాక్షాత్కారము చేసికొనుము. తరువాత నీ హృదయములో గల సద్గుణములను, దుర్గుణములను సాక్షాత్కారము చేసికొని దుర్గుణములను త్యజించుము.

## మత మనగా నేమి ?

(1) 1) సమ్మతము 2) అభిప్రాయము 3) జ్ఞానము 4) అర్చనము అని మతశబ్దమునకు నాలుగు పేరులు కలవు.
(శ్రీమలయాళ సద్గురువు.)

(2) మతమనగా ఉద్రేకపూరితమైన నీతి.
(మాత్యూఅర్నాల్డు)

(3) మతమనగా నీతి ధర్మమునకు జూపు భక్తి. (గాంధీ)

(4) కామ, క్రోధ, లోభాదులు లేనిదే మంచి మతము.
(బుద్ధుడు)

(5) ఒకే చెరువునకు రేవులువంటివి మతములు.
(శ్రీరామకృష్ణ పరమహంస)

(6) లోకములో మంచి, చెడు యను మతములు రెండే కలవు. (సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు)

(7) తత్వశాస్త్రములు సిద్ధాంతము చేయును, మతములు ఆచరించును. (ఓంకారస్వాములవారు)

(8) సత్కర్మమతము, భక్తిమతము, యోగమతము, జ్ఞానమతము యను నాలుగు మతములలోనే లోకములోగల సర్వమతములున్ను అంతర్భూతములై యున్నవి. (గ్రంథకర్త)

" మొదలు తనమతము వదలక
తుద నెవ్వరి మతమునైన దూషింపకయున్
పదపడి కోర్కెలు గోరక
ముదమున నటియించువాడె ముఖ్యుడు వేమా! "

పద్ధతులనుగూర్చి (మతధర్మములనుగూర్చి) పోట్లాడకుము. పరమాత్మసాక్షాత్కారమునే లక్ష్యములో నుంచుకొని, నీ కేది అనుకూలించునో ఆ మార్గమునే ఎన్నుకొనుము—ఇతరులు టెంకలనుగురించి (మతములగురించి) పోట్లాడుదురుగాక. నీవు మాత్రము మామిడిపండ్లను తినుము. అనగా ధర్మాచరణసుఖమును, వైరాగ్యసుఖమును, పరమాత్మధ్యానమును అనుభవించుచుండుము. (శ్రీ వివేకానందస్వామి)

అట్లే, ఇతరులలో సుఖమును, దుఃఖమును, అనుభవించుచున్నట్టి జీవాత్మను నీవు మొదట ఊహించి తెలిసికొనుము. తరువాత నీ హృదయములోగల సుఖదుఃఖాది వికారములతో గూడి జీవుని సాక్షాత్కారము చేసికొని, విచారణ, వైరాగ్యముల ద్వారా జీవగుణములను నశింపజేసికొనుచుండుము.

ఇట్లే ఇతరమానవాది ప్రాణులతో సత్య, జ్ఞాన, ఆనంద స్వరూపములుగా, నిరాకార, నిర్గుణ పరబ్రహ్మము ప్రకాశించుచున్నట్లు మొదట నీవు ఊహించి తెలిసికొనుము. తరువాత నీలో అవస్థాత్రయములకు సాక్షిగా 'ప్రజ్ఞానంబ్రహ్మ' వెలుగొందుచున్న దనియు, అదియే మన నిజస్వరూపమనియు, అదియే సర్వ చరాచరములంతట నిండియుండి సర్వము తానేయై యున్నదనియు అనుభవము నొందుము.



ఓమ్

శ్రీ మహర్షి మలయాళ సద్గురు పరబ్రహ్మణేనమః

# ఆచరణ - అనుభవము

( అనుభవ విభాగము )

శ్లో. అనుభూతిం వినా మూఢో। వృథా బ్రహ్మణి మోదతే
ప్రతిబింబితశాఖాగ్ర । ఫలాస్వాదన మోదవత్ ॥

తా. మూఢులు అనుభవము నొందకనే నేను బ్రహ్మను యని సంతోషింతురు. ఇది నీటిలో ప్రతిఫలించిన వృక్షశాఖాగ్ర ఫలములను చూచి తినుటకు ఉవ్విళ్లూరుచున్నటులనే యుండును. (మైత్రేయ్యోపనిషత్తు)

ఆచరించనిదే అనుభవమునకు రాదు. కనుక నిష్కామ పుణ్యకర్మలచేసి భక్తిసుఖమును, మనస్సును నిగ్రహించి శాంతి సుఖమును, దేహబుద్ధిని నశింపచేసికొని ఆత్మసుఖమును అనుభవించవలయును.

సిద్ధాంతముచేయువారు గురువులు. ఆచరించి అనుభవమునకు తెచ్చుకొనువారు శిష్యులు.

## చేయవలసిన పనులు - పొందబడే అనుభవములు

1. సజ్జనులతోను, భక్తులతోను స్నేహము చేయుము. దీనివలన పుత్ర, మిత్ర, బంధు, గృహాదులపై గల మమకారము నశించుచుండును.

2. భగవంతుని, గురువులను భజించుచు సేవించు చుండుము. దీనివలన విషయభోగములపై గల ప్రీతి నశించు చుండును.

3. దాన ధర్మములను చేయుచుండుము. దీనివలన ధనముపై మోహము తగ్గును.

4. ఇతరులకు సేవ చేయుచుండుము. దీనివలన అహంకారము నశించుచుండును.

5. పెద్దలవలన, భగవద్గీతాది గ్రంథపఠనవలన తెలిసికొనిన మోక్ష (జ్ఞాన, భక్తి, వైరాగ్యాది) ధర్మములను ఎల్లప్పుడును మరువక స్మరించుచుండుము. దీనివలన హృదయములోగల కామ క్రోధాది దుర్గుణములు నశించుచుండును.

6. దేవుని (గురుని) మంత్రము జపించుచుండుము. దీనివలన మనస్సు శుద్ధమై శాంతి నొందుచుండును.

7. దేవుని (గురుని) సాకారమందుగాని, నిరాకారమందుగాని దృష్టినిల్పి చూచుచుండుము. దీనివలన ప్రపంచాకారములు కనబడక పోవుచుండును.

8. ఈ శరీరము నశించిపోవునుగదా యని గుర్తులో నుంచుకొనుము. దీనివలన సుఖదుఃఖములకు, స్తుతినిందలకు, లాభనష్టములకును చలించనిస్థితి కలుగుచుండును.

9. నీకంటె తక్కువవారికిని, నిన్ను బాధించు శత్రువులకును మేలు చేయుచుండుము. నమస్కరించుచుండుము. దీనివలన అందరిలోను సమానముగానున్న దేవుని చూచు దృష్టి వృద్ధియగుచుండును.

10. మనోవృత్తులను తెలిసికొనుచు సాక్షిగా నిర్వికారముగా నున్న ఆత్మను ధ్యానించుచుండుము. దీనివలన దేహామే నేను అను బుద్ధి నశించుచుండును.

## అనుభవవిశేషములు

నీకు లోకము అనిత్యమైనదని, ధనాదివస్తువులు మనవి కావనియు తెలిసియున్నప్పటికిని, లోకేశ్వరునిపై భక్తి కలుగనిదే లోకసంబంధవిషయములపై విరక్తి జనించదు.

నీకు మనోవాక్కాయములతో పాపకర్మల జేయుట తప్పు యని తెలిసియున్నప్పటికిని, పుణ్యకర్మలపై ప్రీతి జనించనంత వరకును నీవు పాపకర్మలచేయుట మానలేవు.

నీకు పుత్రమిత్రాదులతో గల సంబంధము అశాశ్వతమైన భ్రాంతిమాత్రమే యని తెలిసియున్నప్పటికిని, భక్తులపైనను, మహాత్ములపైనను భక్తి కలుగనంతవరకును నీకు పుత్రమిత్రాదుల పై గల మమకారము తగ్గదు.

నీకు దేహాము అనిత్యమైనదని తెలిసియున్నప్పటికిని, పరమాత్మచింతన ధ్యానములతో ఆనందమునొందు స్థితి కలుగనంత వరకును దేహాసుఖముపై (అనగా అలంకారములపై, ఆహార రుచులపై, కామసుఖములపై) గల ప్రీతి నశించదు.

నీకు మనోబుద్ధులు, కామ క్రోధ లోభ మోహా మద మాత్సర్యాది త్రిగుణాత్మికవృత్తులున్న అనిత్యములైనవనియు, దుఃఖహేతువులనియు తెలిసియున్నప్పటికిని, అంతఃకరణమునకు అధిష్టానముగ యున్న పరమాత్మసుఖానుభవము సుస్థిరముగా

నిలువనంతవరకును మనోబుద్ధ్యహంకారవృత్తులకు లోబడుచునే యుండువు.

నీకు ఈ దేహము మరణించునదే యను విషయము తెలిసి యున్నప్పటికిని "అహం బ్రహ్మాస్మి" యను నిశ్చయముతో త్రిపుటిరహితమైన నిర్వికల్ప (అసంప్రజ్ఞాత) సమాధి సిద్ధించనంత వరకును మరణమనిన భయము కలుగుచునే యుండును.

## ధర్మానుభవములు

దరిద్రములో సుఖము, భాగ్యములో దుఃఖమును కనబడవలెను.

వైరాగ్యజీవనములో సౌఖ్యమును,కోరికలలో దుఃఖమును గోచరించవలెను.

దైవచింతనలో అమృతమును, విషయచింతనలో విషమును కనబడవలెను.

సమత్వభావనలో ఆనందమును, భేదదృష్టిలో దుఃఖమును వ్యక్తము కావలెను.

ఇతరులకు ఇచ్చుటలో, సేవచేయుటలో సంతోషమును, ఇతరులనుండి తీసికొనుటలో, సేవచేయించుకొనుటలో క్లేశమును కలుగవలెను.

ప్రేమకలిగియుండుటలో అమృతమును, ద్వేషముకలిగి యుండుటలో విషమును గాంచవలెను.

ఆత్మదృష్టిలో పరమానందమును, దేహదృష్టిలో దుఃఖమును గాంచవలెను.

ఏకాంతనివాసము శాంతిగను, జనసంఘనివాసము అశాంతి గను గోచరించవలెను.

సజ్జనసాంగత్యము స్వర్గముగను, పామరజనులతో చేయు సాంగత్యము నరకముగను గోచరించవలెను.

న్యాయార్జితమైన అన్నవస్త్రాదులు అమృతముగను, అన్యాయార్జితాహారము విషముగను కనబడవలెను.

అయాచితముగా లభించినది అమృతముగను, యాచించి తీసికొనబడినది విషముగను కనబడవలెను.

భగవంతునిపై ఆధారపడి జీవించుటలో ఆనందమును, సంసారవిషయములపై ఆధారపడి జీవించుటలో దుఃఖమును (భయమును) కలుగవలెను.

నిర్వికల్పముగా నుండుట అమృతముగను, సంకల్పముతో నుండుట అధికవిషముగను గోచరించవలెను.

## ఎవ రేలోకమందున్న వా రగుదురు ?

దుఃఖములో నున్నవారు నరకమందున్న వా రగుదురు.

ఇంద్రియవిషయభోగములలో మునిగియున్నవారు స్వర్గమందున్న వా రగుదురు.

ధనాది వస్తువులను కూడబెట్టి తాము సరిగా యనుభవించక, దాన ధర్మముల చేయకయు నున్నవారు మానవలోకమందున్న వా రగుదురు.

అందచందములను చూచుకొనుచు ఆనందించువారు గంధర్వలోకమందున్న వా రగుదురు.

భగవద్భక్తిభావముతో ఉప్పొంగియుండి సంతోషముతో నున్నవారు వైకుంఠమందు లేక కైలాసమందు యున్నవా రగుదురు.

ధ్యాననిష్ఠతో సుఖముగా నున్నవారు బ్రహ్మలోక మందున్నవా రగుదురు.

నిర్వికల్పసమాధినిష్ఠతో పరిపూర్ణపరబ్రహ్మదృష్టియం దున్నవారు కైవల్యస్థితిలో సర్వత్ర నిండియున్నవా రగుదురు. వీరిలో అన్నిలోకములుండును, వీరును అన్నిలోకములలో నిండి యున్నవా రవ్వబడుదురు.

మనస్సును జయించనంతవరకు లోకములు, పుణ్యపాప ములు, సుఖదుఃఖములు, ఆకలిదప్పికలు, శీతోష్ణములు, స్త్రీ పురుష పశుపక్ష్యాది భేదములును తప్పక యుండును. కనుక మనస్సును జయించుటకును, స్వాత్మయందు సంతోషించుచుండుట కును ప్రతిమానవుడును ప్రయత్నించుచుండవలెను.

తమోగుణస్థులు రజోగుణస్థులకు లోబడుదుగు. రజో గుణస్థులు సత్త్వగుణస్థులకు లోబడుదురు. సత్త్వగుణస్థులు గుణ త్రయాతీతులకు లోబడుదురు. గుణత్రయాతీతులే అందరకంటెను గొప్పవారు.

లోకములో పరోపకారవంతులు గౌరవింపబడుదురు. పరమాత్మనిష్ఠాపరులున్ను పూజింపబడుచుందురు.

---

## సూక్ష్మమైన జ్ఞానదృష్టియున్న దానికి గుర్తు లెవ్వి?

ధనాదివస్తువులను బీదలకు, అశక్తులకు, సద్భక్తులకును దానము చేయుచుండుటవలన మన హృదయములో పుణ్యశక్తి వృద్ధియగుచున్నట్లు కనబడుచున్నచో సూక్ష్మమైన జ్ఞానబుద్ధి (దృష్టి) యున్నట్లనని తెలియవలెను.

అంతయున్ను భగవంతునిదేగాని మన దేమియున్ను లేనట్లుగా గోచరించి మమకారము క్షీణించుచున్నచో సూక్ష్మ జ్ఞానదృష్టి యున్నట్లే యగును.

అసత్యవాక్కులవలన, హింసాకార్యములవలన, పరవస్తు పరిగ్రహమువలనను మనలో గల పుణ్యము క్షీణించి, పాపము పెరుగునను విషయము అనుభవములో గోచరించుచున్నచో సూక్ష్మమైన జ్ఞానదృష్టి యున్నట్లే యగును.

హృదయములో కపటమున్నను, కపటముతో మాట్లాడి నను, కపటముతో పనులను చేయుచున్నను ఆ కపటము మనల నెప్పటికైనను శిక్షించుననియు, దుఃఖపెట్టుననియును తెలియు చున్నచో సూక్ష్మజ్ఞానదృష్టి యున్నట్లే యగును.

కోరికలలో సుఖములేదనియు, నిష్కామహృదయముతో నున్నచో ఆ నిష్కామదేవతయే మనకు కావలసినవాటి నన్నిటిని సమకూర్చి పసిపాపలను తల్లి పోషించునట్లు మనలను పోషించునను తత్వము అనుభవములో గోచరించుచున్నచో సూక్ష్మజ్ఞానదృష్టి యున్నట్లే యగును.

నిష్కారణముగా ఇతరులు మనలను నిందించినను, కొట్టి నను, మన వస్తువులను తీసికొనిపోయినను మనలోగల పాపము

పోవుచున్న దేగాని వచ్చుటలేదని గోచరించుచున్నను, ఇట్లే ఇత రులు మనలను స్తుతించునపుడు, సేవచేయునపుడును, అన్నవస్త్ర ధనాదులను మన కిచ్చునపుడున్ను మనలోగల తపశ్శక్తి, పుణ్య ఫలమున్ను క్షీణించిపోవుచున్నట్లు గోచరించుచున్నచో సూక్ష్మ జ్ఞానదృష్టి యున్నట్లే యగును.

జప, ధ్యాన, సంకీర్తనలను ఆత్మానాత్మ, ధర్మాధర్మ విచారణ లను చేయుచుండుటవలన శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయ ములలో గల రాగద్వేషములును (ప్రియాప్రియములును), బంధములున్ను గోచరించుచు వాటిపై వైరాగ్యము జనించి పరమాత్మసుఖము గోచరించుచున్నచో సూక్ష్మజ్ఞానదృష్టి యున్నట్లే యగును.

మనోనిగ్రహములోనే శాశ్వతమైన మోక్షసుఖము కలదనియు, మనశ్చలనములోనే శత్రుమిత్రులు, భార్యాభర్తలు, ధనధాన్యాదులు, సుఖదుఃఖాదులున్ను కలవేగాని వెలుపల యివెవ్వియున్ను లేనట్లు గోచరించుచున్నచో సూక్ష్మజ్ఞానదృష్టి యున్నట్లే యగును.

వీరు మన కులస్థు లనియు, వీరు మన ఆశ్రమస్థు లనియు, వీరు మన బంధు మిత్ర పుత్రాదులనియును, స్థూల(దేహ)దృష్టితో ప్రేమించక ఇతరు లెవ్వరైనను, మనవా రెవ్వరైనను, సద్గుణము లను, సద్ధర్మపరివర్తనలను చూచి ప్రేమించేదృష్టి మనకు లభించి యున్నచో సూక్ష్మజ్ఞానదృష్టి యున్నట్లే యగును.

దేవమానవాదులు, పశుపక్ష్యాది మృగములు, వృక్షల తాదులు (నామరూపములు) న్ను పరమాత్మకు అన్యముగా గోచరించకయున్నచో సంపూర్ణ జ్ఞానదృష్టి యున్నట్లే యగును.

మనోవాక్కాయములతో సద్వినియోగపరచిన కాలము తప్ప యితరు లెవ్వరున్ను మనలను వృద్ధిలోనికి తీసికొనిరాలేరని దృష్టికి గోచరించుచున్నచో సూక్ష్మమైన జ్ఞానదృష్టి యున్నట్లే యగును.

వెలుపలి నామరూపములవలన గల్గిన సుఖములన్నియున్ను తుచ్ఛమైనవే యనియు, ఆత్మసుఖమే, నిర్గుణానందమే శాశ్వత మైనదనియును గోచరించినచో సూక్ష్మమైన జ్ఞానదృష్టి యున్నట్లే యగును.

గొప్ప కోటీశ్వరుడైనను, గొప్పఉద్యోగస్థుడైనను, గొప్ప ధనరాసియైనను, చిన్న మట్టిగడ్డయైనను, కుక్క, కాకి, చీమ లైనను, జ్ఞానియైనను, మూఢుడైనను పరమాత్మయే నను అభేద దృష్టి యున్నచో సూక్ష్మమైన జ్ఞానదృష్టి కలిగినదానికి గుర్తుగా తలంచవలెను.

శరీరము చేయు తప్పులను, వాక్కుచేయు తప్పులను, మనస్సుచేయు తప్పులను స్పష్టముగా గుర్తించి నిగ్రహించుశక్తి కలిగినచో సూక్ష్మబుద్ధిబలము ఉన్నట్లే యగును.

మన పనులను పరమాత్మ చూచుచున్నట్లు, మన మాట లను దేవుడు వినుచున్నట్లు, మన సంకల్పములను సర్వేశ్వరుడు తెలిసికొనుచున్నట్లును స్వయముగా తెలియబడుచున్నచో సూక్ష్మజ్ఞానమున్నట్లే.



## అజ్ఞానము - జ్ఞానము - విజ్ఞానము

శ్లో. జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా । కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ । సమలోష్టాశ్మకాంచనః ॥

జ్ఞానముచేతను, విజ్ఞానముచేతను సంతుష్టమైన హృదయము గలవాడును, నిశ్చలుడును, మానసాదీంద్రియములను స్వాధీన పరచుకొనినవాడును, యోగియు నగు మహాత్ముడు సమస్త నామ రూపములను మన్ను బంగారములను సమముగా జూచును. సమత్వదృష్టిగలవారికి దుఃఖము భయము మోహము మమకారము క్రోధము అభిమానము మొదలగు ప్రకృతి (మాయ) సంబంధమైన గుణదోషము లెవ్వియు నుండవు. కనుక ఇట్టి సమత్వజ్ఞానదృష్టి నొందుటకు మనము రాత్రింబవళ్లను ప్రయత్నము చేయుచుండవలెను.

అజ్ఞానము, జ్ఞానము, విజ్ఞానములగురించి ఒకింత వివరించెద:

మనోవాక్కాయములతో చెడ్డపనుల చేయుట అజ్ఞానము. మంచిపనులను చేయుట జ్ఞానము. మంచి చెడ్డలు లేని పరమాత్మ దృష్టితో నుండుట విజ్ఞానము.

విద్య, ధనము, సౌందర్యములనుచూచి ప్రేమించుట అజ్ఞానము. మంచిప్రవర్తన,సద్గుణముల చూచి ప్రేమచూపుట జ్ఞానము. ఇతరులలో పరమాత్మనుమాత్రమే చూచుచు ప్రేమచూపుట విజ్ఞానము.

స్త్రీని చూచినపుడు రాగము ( మోహము ) కలిగియుండుట అజ్ఞానము. స్త్రీని తల్లిగాగాని, సోదరిగాగాని

చూచుట జ్ఞానము. స్త్రీని స్వాత్మ కన్యముగా గాంచకుండుట విజ్ఞానము.

దేహామే తా నను బుద్ధితో నుండుగ అజ్ఞానము. పెద్దల ద్వారా పరమాత్మయే తా నని గ్రహించి ధ్యానము చేయు చుండుట జ్ఞానము. పరమాత్మస్వరూపముతో త్రిపుటిరహిత మైన సమాధ్యనుభవము గలిగియుండుట విజ్ఞానము.

స్త్రీ తనభర్తను సామాన్యమానవునిగా చూచుట అజ్ఞానము. తన భర్తను దేవునిగా చూచుకొనుచుండుట జ్ఞానము. తన భర్తను తన యాత్మస్వరూపునిగా గాంచుచుండుట విజ్ఞానము

తన సుఖమును తాను చూచుకొనుట అజ్ఞానము. ప్రపంచ క్షేమమును కోరి ప్రవర్తించుట జ్ఞానము. సర్వత్రదైవమునే గాంచు చుండుట విజ్ఞానము.

దేవుడు లేడనుట అజ్ఞానము. దేవుని నమ్మి భజించు చుండుట జ్ఞానము. దేవునిస్వరూపమే స్వస్వరూప మను తత్త్వాను భూతితో నుండుట విజ్ఞానము.

సుఖదుఃఖ స్తుతినింద శత్రుమిత్రాది ద్వంద్వములకు చలించుట (లోబడుట) అజ్ఞానము. సుఖదుఃఖాదులకు (సాక్షిగా యున్న పరమాత్మధ్యానముతో) చలించకుండుట జ్ఞానము. సుఖదుఃఖాది ద్వంద్వములులేని పరబ్రహ్మానందస్థితియందు సుస్థిర ముగా నుండుట విజ్ఞానము.

పెద్దలద్వారా శ్రవణముచేసిన భక్తి జ్ఞాన వైరాగ్య ధర్మములను విపరీతముగా అర్థము చేసికొనుట అజ్ఞానము. సక్రమ ముగా గ్రహించుట జ్ఞానము. శ్రవణము చేసినవాటిని మననము, ధ్యానము చేసి అనుభవమునకు తెచ్చుకొనుట విజ్ఞానము.

కోరికలు (ఆశలు) కలిగియుండుట అజ్ఞానము. కోరిక లుండకూడదని నిగ్రహించుట జ్ఞానము. కోరికలు నశించుట విజ్ఞానము.

క్రోధముతో వర్తించుట అజ్ఞానము. క్రోధమును అణచుకొనుట జ్ఞానము. క్రోధమనునది నశించుట విజ్ఞానము.

కొట్టినవారిని తిరిగి కొట్టుట అజ్ఞానము. కొట్టినవారిని (అపకార మొనర్చినవారిని) తిరిగి కొట్టుట తప్పు యనుకొని సహించుట జ్ఞానము. కొట్టినవారు నాయాత్మస్వరూపులే యనుకొని సమత్వదృష్టితో నుండుట విజ్ఞానము.

నాది, నావారు యను మమకారముతో నుండుట అజ్ఞానము. అన్నివస్తువులు, అన్నిప్రాణులును దేవునివే యనుకొనుట జ్ఞానము. సర్వము స్వాత్మస్వరూపమే యనుకొనుట విజ్ఞానము.

నేను, నీవు యను భేదదృష్టితో నుండుట అజ్ఞానము. అందరున్ను దేవునిబిడ్డలే యనుకొని గౌరవించుట జ్ఞానము. సర్వత్ర అద్వైతపరబ్రహ్మమునే గాంచుచుండుట విజ్ఞానము.

దేవతావిగ్రహమును రాయి (లోహము) యనుకొనుట అజ్ఞానము. దేవత యనుకొనుట జ్ఞానము. స్వాత్మ కన్యము కాదనుకొనుట విజ్ఞానము.

కట్టెయవస్థ అజ్ఞానము. కట్టె అగ్నియగుట జ్ఞానము. కట్టె బూడిదయవస్థనొందుట విజ్ఞానము. ఇట్లే దేహబుద్ధి అజ్ఞానము. జీవబుద్ధి కలిగియుండుట జ్ఞానము. ఆత్మబుద్ధితో నుండుట విజ్ఞానము.

గ్రంథములను చదువుచు కాలము గడపుచుండుట అజ్ఞానము. హృదయమును (ఆత్మానాత్మలను) చదువుచుండుట జ్ఞానము. ఆత్మస్థితిని మరువకుండుట విజ్ఞానము.

అన్యాయ (అధర్మ) మార్గమున సంపాదింపబడినదియు, అసాత్త్వికమైనదియు నగు ఆహారమును భుజించుట అజ్ఞానము. న్యాయార్జితమైనది, సాత్త్వికమైనదియు నగు ఆహారమును మితముగా దైవస్మరణతో భుజించుట జ్ఞానము. అఖండాత్మ దృష్టితో నేను భుజించువాడను (చేయువాడను), అనుభవించు వాడను కానను కొనుట విజ్ఞానము.

కాలమును దురుపయోగపరచుట, వ్యర్థపరచుటయు అజ్ఞానము. కాలమును సదుపయోగపరచుకొనుట జ్ఞానము. కాలాతీతమైన అఖండపరబ్రహ్మానుభవముతో నుండుట విజ్ఞానము.

విద్యాధనములతో గర్వము కలిగియుండుట అజ్ఞానము. భక్తుడను, తపశ్శాలిని యను అభిమానముతో నుండుట జ్ఞానము. కేవలము బ్రహ్మానుభవముతో నుండుట విజ్ఞానము.

అజ్ఞానము పాపస్వరూపము. జ్ఞానము పుణ్యపాపములతో నుండును. విజ్ఞానము పుణ్యపాపములను నశింపచేయును.

జ్ఞానముతో అజ్ఞానమును, విజ్ఞానముతో జ్ఞానమును దాటవలెను. ఇదే కైవల్యమోక్షము.



## అజ్ఞానము - జ్ఞానము

అజ్ఞానమనగా నిజమెరుంగకుండుట, జ్ఞానమనగా నిజమెరుగుట.

పాపముయొక్క తత్త్వము తెలియనంతవరకును పాప కార్యములపై ప్రీతి జనించుచునే యుండును. పుణ్యకార్యముల యొక్క తత్త్వము తెలియనంతవరకు వాటిపై ప్రీతి జనించదు. ఆత్మతత్త్వము తెలియనంతవరకును దేహామే నేను యను అహాంకారము నశించదు.

హింస, అసత్యభాషణ, దొంగతనము, వ్యభిచారము మొదలైన దుష్టవర్తనలు, దుర్గుణములున్న సాధారణముగా అజ్ఞానమని చెప్పబడును. అనిత్యమైన దేహామే నేను అని అను కొనుటయే (అహాంకారము కలిగియుండుటయే) సాక్షాత్తుగా అజ్ఞాన మనబడును.

సత్యము, శాంతము, దయ, నిష్కామము, సమత్వము, ఓర్పు, ధైర్యము, పరోపకారము చేయుట, పూజ, సంకీర్తన, జపము, ధ్యానము, నిత్యానిత్యవస్తువిచారణ మొదలైన సద్గుణ ములపై, సత్కర్మలపై ప్రీతిగలిగి వర్తించుట సాధారణజ్ఞాన మగును. దేహాము నేనుగాను, సర్వపరిపూర్ణపరబ్రహ్మామే నేను యను నిశ్చయదృష్టితో నుండుటయే సాక్షాత్తుగా జ్ఞాన మనబడును.

అజ్ఞాని నాకు నామరూపప్రపంచముతప్ప మరేమి యున్ను కనిపించుటలేదనును.

జ్ఞాని నాకు అంతటను నా యాత్మతప్ప ప్రపంచమేమి యున్ను గోచరించుటలేదనును.

సాధనస్థితిలో, సంకల్పగుణములలో నుండువారు అతీత ధర్మములను, అతీతస్థితిని బోధించునట్టి గ్రంథములను, భాగములను ఎక్కువగా చదువక, భక్తి వైరాగ్యవిచారణ నీతి ధర్మములను బోధించు గ్రంథములనే ఎక్కువగాచదువుచు, మననముచేయుచు, ఆచరించుటకు సదా ప్రయత్నము చేయుచుండవలెను.

మానసాదీంద్రియములను చెడుమార్గములో (ప్రవృత్తి మార్గములో) పడనీయక జాగ్రత్తకలిగి సర్వదా ప్రయత్నములో నున్నచో ఇంద్రియాతీతస్థితియగు పరబ్రహ్మానుభవము స్వయముగా వచ్చి చేరుచుండును. ఈ రహస్యము తెలియక సాధువులలో, వేదాంతులలో ననేకులు ఆచరణశూన్యులై చెడిపోవుచున్నారు.

తెలిసియున్న ధర్మములను ఆచరణలో పెట్టినచో తెలియకయున్న బ్రహ్మము బయటపడును.

## శుద్ధహృదయులు – అశుద్ధహృదయులు

హృదయశుద్ధి యనగా కామ క్రోధాది గుణములు లేకుండుట యగును. హృదయశుద్ధి గలవారికి సత్యస్వరూపుడైన పరమాత్మ గుర్తులో నుండును. అశుద్ధహృదయులకు ప్రపంచ సంబంధమైన శబ్ద స్పర్శాది విషయములే గుర్తులో నుండును.

దైవసుఖమునందు ప్రీతియు, దైవానందానుభవమును హృదయశుద్ధి గలవారికి తప్పకయుండును. "అహం బ్రహ్మాస్మి" అనిగాని, శ్రీరామ-శ్రీకృష్ణ యనిగాని, ఓం నమోనారాయణాయ, ఓం నమశ్శివాయ యనిగాని హృదయశుద్ధిగలవారు ఎల్లప్పుడున్ను మరువక జపము చేయుచునే యుందురు.

నామరూపప్రపంచవిషయములపై హృదయశుద్ధి గలవారికి ఏమాత్రమైనను ప్రీతి యుండదు. హృదయశుద్ధి గలవారికి ఎప్పుడైనను కామ క్రోధ భయాది గుణములుగాని, సుఖదుఃఖములుగాని వచ్చినను నీటిపై వ్రాతవలె వెంటనే వచ్చు[illegible]కువచ్చి కనబడక పోవును.

గొప్ప ఉత్సవములను చూచినను, సాధుపుంగవులను, పరమభక్తులను చూచినను, పరమదుర్మార్గులను చూచినను, నీచమైన మాటలను వినినను, మంచిమాటలను వినినను హృదయ శుద్ధిగలవారు వికారము చెందక, వాటినన్నిటిని స్వప్న తుల్యముగా గాంచుదురు. ఇట్టివారి జీవితమే బ్రహ్మానందముతో నుండును.

హృదయశుద్ధి గలవారికి దేహము నే నను బుద్ధి మిక్కిలి స్వల్పముగా నుండును. ఆత్మయే నే నను బుద్ధి మిక్కిలి అధికముగా నుండును.

దేహసంబంధమైన అవస్థలు, ప్రపంచ సంబంధమైన విషయములున్ను హృదయశుద్ధి లేనివారికి విశేషముగా గోచరించును. అందువలన వారు దైవమునుగాని, స్వాత్మను గాని గుర్తులో నుంచుకొనజాలరు.

ప్రపంచమును నేత్రములు చూచుచున్నవి. నేత్రములను మనస్సు చూచుచున్నది. మనస్సును సుఖదుఃఖస్వరూపుడైన జీవుడు చూచుచున్నాడు. జీవుని పరమాత్మ చూచుచున్నాడు.

లోకమును, దేహసౌఖ్యమును దృష్టిలో నుంచుకొనక దైవమునుమాత్రమే ఎల్లప్పుడును దృష్టిలో నుంచుకొనినచో

మనము తప్పక శాశ్వతానందమును కొంచెము కొంచెముగా ప్రతిదినమును అభివృద్ధిలోనికి తెచ్చుకొనగల్గుదుము.

పుట్టుటలో, బ్రతుకుటలో, చచ్చుటలోను గొప్పతనము లేదు. మంచిపనులను చేయుటలో, జగదీశ్వరుని భజించుటలో, మానసేంద్రియములను జయించుటలో, స్వస్వరూపసాక్షాత్కార జ్ఞానమును సంపాదించుకొనుటలోను గొప్పతనము కలదని భక్తులు, సాధువులు, పండితులున్ను గుర్తులో నుంచుకొని మెలగవలెను.

కపటవేషములు, కపటముతో చేయు వ్యవసాయ, వ్యాపారాది క్రియలు, కపటముతోకూడిన మాటలు, ఆలోచనలున్ను జీవితమును, లోకమును పాడుచేయును.



## నీవు నిజముగ తెలిసినవాడవైతే చలించెదవేల ?

(1) నీకు దేహ మనిత్యమైనదని తెలిసినదా ? తెలిసినచో ) దేహమును ఇతరులు దూషించినపుడును, కొట్టినపుడును దుఃఖ ]డెదవేల ?

(2) నీకు ధన మనిత్యమైనదని తెలిసినదా ? తెలిసినచో ]నమున్నప్పుడు సంతోషమును, పోయినపుడు దుఃఖము నొందెద ]ేల ?

(3) నీకు బంధుమిత్రాదులతోగల సంబంధ మనిత్యమైనదని ]ెలిసినదా ? తెలిసినచో బంధుమిత్రాదులకు కలిగిన సుఖము, ]ాభములకు సంతోషమును, దుఃఖము నష్టములకు క్లేశమును ]ొందెదవేల ?

(4) నీకు లోకము అనిత్యమైనదని తెలిసినదా? తెలిసినచో పరమాత్మచింతనతోనే సంతుష్టినొందక చూడవలెను, తెలిసికొనవలెను, చేయవలెను, నేర్చుకొనవలెను యను భ్రాంతులతో తిరిగెదవేల ?

(5) నీకు పరమాత్మసుఖమే శాశ్వతమైనదని తెలిసినదా? తెలిసినచో ఇంద్రియవిషయభోగములకు లోబడెదవేల ?

(6) నీకు సుకృతమే సుఖపెట్టునను విషయము తెలిసినదా? తెలిసినచో పాపకర్మలను వదలి దేహధనాదులతో మానవాది ప్రాణులకును, భగవానునకును ప్రీతిగలుగు పనులను జేయవదేల ?

(7) నీకు సర్వమున్ను దేవునిదేగాని మన దేమియున్ను లేదను దృఢనిశ్చయమున్నదా ? ఉన్నచో ఇది నాది, నేను యిచ్చుచున్నాను, దాని నివ్వలేను యను మమకారముంచుకొనెదవేల ?

(8) నీకు భగవంతునిపై నిజమైన భక్తి యున్నదా ? ఉన్నచో దైవచింతన విడచి ఇతర చింతలతో బాధలుపడెదవేల ?

(9) నీకు అందరున్ను పరమాత్మస్వరూపులే యను విషయము తెలిసినదా? తెలిసినచో నావారు, నీవారు, శత్రువులు, మిత్రులు యను భేదములతో వర్తించెదవేల ?

(10) నీకు సర్వమున్ను ఈశ్వరసంకల్పము ప్రకారము జరుగుచున్నదను విషయము తెలిసినదా ? తెలిసినచో నేను చేసెదను, నేను చేయను, యిచ్చెదను, యివ్వను, వెళ్లెదను, వెళ్లను యని అహంకర్తృత్వములతో నుండెదవేల ?

(11) నీకు నిజముగా శ్రీసద్గురువుపై భక్తి విశ్వాసము లున్నవా ? ఉన్నచో గురువు చెప్పిన ఆజ్ఞలను మీరి కామక్రోధాది గుణములతో వర్తించెదవేల ?

## గొప్పదేది ?

ధనముకంటె మానవసహాయము గొప్పది. మానవ సహాయముకంటె నీవు చేసికొనిన సుకృతము గొప్పది. సుకృతముకంటె దైవము గొప్పవాడు. దైవముకంటె సద్గురువు గొప్పవాడు. సద్గురువుకంటె మనశ్శాంతి గొప్పది. మనశ్శాంతికంటె స్వాత్మస్వరూపజ్ఞానానుభవము గొప్పది.

నేను అభివృద్ధిలోనికి వచ్చినదానికి గుర్తులెవ్వి ? పతనము పొందిన దానికి గుర్తులెవ్వి ?

నీ మనస్సు, వాక్కు, శరీరమున్ను సత్య ధర్మ ప్రవర్తన తప్పకయున్నయెడల, నీ మనస్సు కామ క్రోధ లోభ మోహాది గుణములతో నుండక స్వాధీనముం దున్నయెడల, నీ దృష్టికి సుఖదుఃఖములు, స్తుతినిందలు, శత్రుమిత్రులు, స్త్రీ పురుషులు, మన్ను బంగారము యను భేదములు తోచక సర్వత్ర సచ్చిదానందపరబ్రహ్మమే గోచరించుచున్నయెడల నీవు అభివృద్ధిలోనికి వచ్చినట్లగునని నిశ్చయించుకొనుము.

నీ మనస్సు, నీ వాక్కు, నీ శరీరమున్ను ఇతరులకు బాధలు కలుగు పనులను చేయుచున్నయెడల, అపకీర్తి వృద్ధియగుచున్న యెడల, నీ హృదయము కామముతో, ఆశలతో, క్రోధముతో, మోహముతో, లోభగుణముతో, గర్వముతో, అహంకారముతో, దుఃఖాదులతోను చంచలమై అశాంతితో, ద్వైతభావముల తో యున్నయెడల, సత్యమైన పరమాత్మసుఖము మరుగు యెడల, దేహాభిమానము పీడించుచున్నయెడల నీవు పతనము జెందితివని గుర్తించుము.

పాపపు వర్తనలచే పతనమును, పుణ్య వర్తనలచే అభివృద్ధియు కలుగుచుండును.

కనుక పరులకు బాధ కలిగించకుండుట, పరుల సహాయమును, సొమ్మును తీసికొనకుండుట, జీవితమును సత్యమైన పరమాత్మకు సమర్పించి, సదా దైవచింతనతోను, ధర్మప్రవర్తనతోను యుండి మిథ్యాస్వరూపములైన దేహాది ప్రపంచ నామ రూప విషయములందు వైరాగ్యము కలిగియుండుటయు ముముక్షువులయొక్కయు భక్తులయొక్కయు ముఖ్యకర్తవ్యమను విషయమును మరువరాదు.

దేహ ధనాది ప్రపంచము అనిత్యమైనదని తెలిసికొనియుండుట గొప్పదికాదు. ఆత్మ నిత్యమైనదని నిశ్చయించుకొని మరువకుండుట గొప్పది.

## అనుభవ తరంగములు

(1) నీకు పుణ్యకర్మలలో సుఖము గోచరించనిదే నీవు పాపకర్మలను మానలేవు.

(2) నీకు నిష్కామకర్మలలో గల ప్రభావము (ఆనందము) గోచరించనిదే నీవు సకామకర్మలను వదలలేవు.

(3) నీకు మౌనసుఖము దొరకనిదే నీవు అనవసర ప్రసంగములను మానలేవు.

(4) నీకు శాంతసౌఖ్యము లభించనిదే నీవు క్రోధమును వదలలేవు.

(5) నీకు త్యాగసౌఖ్యము రుచించనిదే నీవు లోభ
ణమును త్యజించలేవు.

(6) నీకు సన్న్యాససుఖము దొరకనిదే నీవు సంసార
ఖమును తన్ని వేయలేవు.

(7) నీకు నిశ్చలత్వములో గల సుఖము దొరకనిదే నీవు
ంచల్యమును అణచలేవు.

(8) నీకు ఆత్మసుఖము దొరకనిదే నీవు అనాత్మగుణము
ు చంపలేవు.

(9) నీకు నిర్వికల్పసుఖము చేకూరనిదే నీవు సంకల్పము
ు నిగ్రహించలేవు.

(10) నీకు నిరహంకారసుఖ మబ్బనిదే నీవు సుఖదుఃఖ,
నింద, రాగద్వేష, శీతోష్ణాది ద్వంద్వములను జయించలేవు.

(11) నీకు సమత్వసుఖము లభించనిదే నీవు భేదభావము
త్యజించలేవు.

## అనుభవచతుష్టయము

### (1)

(1) జగము ( దేహము ) పుణ్యపాపమయముగా కన
ట కర్మదృష్టి.

(2) జగము భగవన్మయముగా కనబడుట భక్తిదృష్టి.

(3) జగము (సంసారము) సంకల్ప (మనో) మయముగా
డుట యోగదృష్టి.

(4) జగము ఆత్మ (బ్రహ్మ) మయముగా కనబడు చుండుట జ్ఞానదృష్టి.

(2)

1) ఇతరులుచేయు పుణ్య పాప మిశ్రకర్మలను చూచుట కర్మదృష్టి.

2) ఇతరులలో సుగుణ దుర్గుణములను పరికించి చూచుట ధర్మదృష్టి.

3) ఇతరజీవరాసులను భగవంతుని బిడ్డలనుగా గాంచుట భక్తిదృష్టి.

4) ఇతరులను స్వాత్మస్వరూపులనుగా చూచుచుండుట జ్ఞానదృష్టి.

(3)

1) నా దేహమును, స్వయముగా నేను కష్టపడి ఆహారాదులను సంపాదించి పోషించుకొందు ననువాడు కర్మిష్ఠుడు.

2) నా దేహమును, నా భగవంతుడే పోషింపజేసికొను నను నిశ్చలవిశ్వాసముతో నుండువాడు భక్తుడు.

3) నాదేహమును సంకల్పశక్తితో కావలసిన వాటి నన్నిటిని తెప్పించుకొని పోషించుకొందు ననువాడు యోగి.

4) నా దేహమును దాని ప్రారబ్ధమే నిలబెట్టి పోషింప జేయు నని ఉపేక్షించి యుండువాడు జ్ఞాని.

(4)

(1) నేను సదా నిష్కామభావముతో నిస్సంగినై కర్మల చేయుచు సుఖదుఃఖ, పుణ్య పాప బంధమునుండి విముక్తుడ నయ్యెదనని కర్మయోగి నిశ్చయించుకొనియుండును.

(2) నేను సదా నా యిష్టదేవతను భజించుచు ముక్తుడ నయ్యెదనని భక్తుడు నిశ్చయించుకొని యుండును.

(3) నేను సదా మనశ్చలనమును నిగ్రహించుచు నామ రూప, పుణ్య పాప, సుఖ దుఃఖముల నుండి విడుదల నొందెద నని యోగి నిశ్చయించుకొని యుండును.

(4) నేను సదా—శరీరా దీంద్రియములు నేను గాను, అహం బ్రహ్మాస్మి, సోహం యనుకొనుచు సర్వబంధములనుండి విముక్తుడ నయ్యెదనని జ్ఞాని నిశ్చయించుకొని యుండును.

(5)

(1) కర్మిష్ఠుడు—మనస్సుతో, వాక్కుతో, శరీరము తోను చేసిన పాపకర్మలే దుఃఖముకలుగుటకు కారణము లనును.

(2) భక్తుడు—మనోవాక్కాయములను భగవంతునకు సమర్పించక యుండుటయే దుఃఖహేతువు లగునని చెప్పును.

(3) యోగి—మనోసంకల్పములను (రాగద్వేషములను) నశింపచేయక యుండుటయే దుఃఖకారణము యగునని చెప్పును.

(4) జ్ఞాని—తన్ను తాను (ఆత్మను) మరచుటయే, దేహాభిమానమే, దుఃఖములు కలుగుటకు హేతువు యగుచున్నదని చెప్పును.

(6)

తమోగుణస్థులకు—సుఖము, దుఃఖము, స్తుతి, నింద, లాభము, నష్టము, రాగము, ద్వేషము కలిగినచో చాలాకాలము గుర్తులో నుండును.

రజోగుణస్థులకు—కొంతకాలమే గుర్తులో నుండును.

సత్త్వగుణస్థులకు—స్వల్పకాలమే గుర్తులోనుండి మరపునకు వచ్చును.

గుణత్రయాతీతులకు — నీటిపై వ్రాతవలె క్షణకాలము కూడ గుర్తులో నుండదు.

(7)

తమోగుణస్థులకు—దేహము, సంసారము, జగము, విగ్రహారూపముగ యున్న దేవుడున్ను, నిత్యమైనదిగా కనిపించును.

రజోగుణస్థులకు—సగము అనిత్యమైనదిగాను, సగము నిత్యమైనదిగాను గోచరించును.

సత్త్వగుణస్థులకు— బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య యను నిశ్చలదృష్టి యుండును.

గుణత్రయాతీతులకు—సర్వమున్ను ఒకే బ్రహ్మమయముగా అనుభవమై యుండును.

(8)

సదా పుణ్యకర్మలనే చేయుచు పుణ్యాత్ము డనిపించుకొనుము. సర్వదా తల్లి, తండ్రి, గురు దైవము లకు సేవ చేయుచు భక్తు డనిపించుకొనుము. సదా మానసాదింద్రియములను నిగ్రహించుచు యోగి వనిపించుకొనుము. సర్వమును స్వాత్మస్వరూపముగా గాంచుచు జ్ఞాని వనిపించుకొనుము.



## హృదయపరిపక్వదశలు - జ్ఞానానుభవములు

(1) నీ హృదయము పరిపక్వదశకు రానంతవరకును నీవు మనస్సుతోను, వాక్కుతోను, శరీరముతోను చేయుచున్న పాపకర్మలను మాని త్రికరణములతోను పుణ్యకర్మలను చేయ జాలవు.

(2) నీ హృదయము పరిపక్వము కానంతవరకును నీవు ధనము అనిత్యమైనదనియు, దాన ధర్మములే మనలను రక్షించు చుండుననియును తెలిసికొనియున్నప్పటికిన్ని నీవు దానధర్మ ములను చేయజాలవు.

(3) నీవు పరిపక్వదశకు రానంతవరకును సంసారము మిథ్య యనియు, భోగములు క్షణికము లనియు, రోగకారణము లనియు, బంధమును పెంచునవనియును, చదువుచున్నప్పటికి, వినుచున్నప్పటికి, చూచుచున్నప్పటికిన్ని వాటిని త్యాగము చేయుటకు, మమకారమును వదలుటకు సమర్థుడవు కాజాలవు.

(4) నీవు పక్వదశకు రానంతవరకు భగవంతుడే రక్షకు డనియు, ఆయననే సర్వకాల సర్వావస్థలయందును మరువక భజించుచుండవలెననియును, నీ వెన్నిపర్యాయములు చదివినప్పటి కిన్ని, వినుచున్నప్పటికిని, వాక్కుతో భగవన్నామమును కీర్తించు చుండలేవు, మనస్సుతో జపధ్యానములను చేయుచుండలేవు.

(5) నీ అంతఃకరణము పరిపక్వదశకు రానంతవరకును భగవద్గీతాది సద్గ్రంథములను అనేకసంవత్సరములనుండి చదువు చున్నప్పటికి, వినుచున్నప్పటికి, గీతోపన్యాసములు, వేదాంతో పన్యాసము లిచ్చుచున్నప్పటికిన్ని, కర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్యాది ధర్మములను అనుష్ఠించ లేవు.

(6) నీ హృదయము పక్వమునకు రానంతవరకును సుఖ దుఃఖములకు, స్తుతి నిందలకు, లాభ నష్టములకు, రాగ ద్వేషములకు, స్త్రీ పురుషాది భేదములకును భక్తులు, ముక్తిపదము నొందగోరు వారు చలించకూడదను విషయములను ఎన్ని సంవత్సరముల నుండియో చదువుచు, వినుచు నున్నప్పటికిన్ని సుఖ దుఃఖాది ద్వంద్వములకు చలించక యుండలేవు.

(7) నీ హృదయము నిర్మలము కానంతవరకును నీవు ఏకాంతమున కూర్చొని, జప ధ్యాన సద్విచారణలతో గంటల కొలదీ, దినములకొలది కాలమును గడుపుచుండలేవు.

(8) నీ హృదయము పరిపక్వదశకు రానంతవరకును గురువులు నిన్ను మహాత్ములకోటిలో చేరుమనియు, వారివలె కామ క్రోధ భయాద్యహంకారములనుండి విముక్తి నొందుమనియు, నిర్వికల్పముగా, నిర్వికారుడవుగా నుండి పరబ్రహ్మా నందసాగరములో ఓలలాడమనియు ఎంతకాలము చెప్పినను ఆ మోక్షస్థితిలో నిలువజాలవు.

(9) నీ హృదయము పక్వదశకు రానంతవరకును జాతి నీతి, కులగోత్రములు నాకు లేవనీ, పంచకోశములు నేను గాననీ, అవస్థాత్రయములకు సాక్షిననీ, గుణత్రయాతీతుడననీ, అఖండసచ్చిదానందపరబ్రహ్మమే నేననీ, నీవు చెప్పుకొను చున్నప్పటికిన్ని నామరూపక్రియాది భావములను అతిక్రమించి సర్వాత్మభావములో నిలువజాలవు.

తీర్థయాత్రలు, యజ్ఞములు, పూజలు, దానములు, సజ్జన సహవాసము, సద్గురుసేవ, భగవన్నామసంకీర్తన, జప ధ్యాన నిష్ఠలు మొదలైన సత్కర్మలను చేసినవారు, చేయుచున్న

వారున్ను మాత్రమే ఆధ్యాత్మికజ్ఞానధర్మములను అనుష్ఠించి అనుభవము నొందుటకు సమర్థు లగుదురు.

## దైవప్రార్థన చేయునపు డెట్టిభావన లుండవలెను ?

దైవపూజ, నమస్కారము, భగవన్నామసంకీర్తన, జప ధ్యానములు మొదలగు దైవసంబంధమైన సాధనధర్మములను అనుష్ఠించునపుడు భగవంతుని, శ్రీ సద్గురుదేవుని రూపమునందు నీ దృష్టిని నిలిపియుంచవచ్చును. భగవన్నామ శబ్దములో నీ బుద్ధిని లయింప చేసికొని ఆనందముగా నుండవచ్చును. నేను చేయు పూజ, నా ప్రార్థనయు భగవంతుడు చూచుచున్నాడనియు, ఆలకించుచున్నాడనియు భావించుచుండవచ్చును. ప్రార్థన ధ్యానాదులను చేయుచున్నప్పుడు, చేసినతరువాతను భగవంతుడు నా ప్రార్థన, నా ధ్యానము, నేను చేయు మంచి పనులను చూచి చాలా సంతోషించుచున్నాడనియు, అనుగ్రహము చూపుచున్నాడనియు, నన్ను నిరంతరమును కాపాడుచున్నాడనియు గ్రహించుచు ఆనందముగా నుండవచ్చును. పరమాత్మ (దేవుడు) నా హృదయములో పుట్టుచున్న మంచి సంకల్పములను, చెడు సంకల్పములను, మంచి భావములను, చెడ్డ భావములను, సంతోషమును, దుఃఖమును, ధైర్యమును, పిరికితనమును, శాంత గుణమును, క్రోధ గుణమును, విశాల భావమును, అల్పభావమును చూచుచున్నాడనియు నాలో గల మంచికి సంతోషించుచున్నాడనియు, నాలో గల చెడు గుణములకు కోపగించుచున్నాడనియు భావించుచుండవచ్చును. భగవంతుడు అన్ని భూతములలోను సమానముగా తెలివి

రూపముగా (జ్ఞానస్వరూపముగా) ఆనందస్వరూపముగా, సత్యస్వరూపముగా యున్నాడనియు సంభావించుచుండవచ్చును. భగవంతుడు నాలోపల, నాచుట్టూ, పైన, క్రింద, ప్రక్క లందును నిండి వెలుగుచున్నాడని సంభావించుచుండవచ్చును.

దేవతలందరూ భగవంతునిసంబంధీకు లనుకొనుము. భక్తులందరూ నాబంధువులు అనుకొనుము. మహాత్ములందరూ నాతండ్రు లనుకొనుము, తదితరమానవులు, జంతుజాలములున్ను భగవంతుని సంతాన మనుకొనుము.

భగవంతునిపై ఆధారపడి జీవించుచున్నప్పుడు హాయిగా నుంటున్నదనియు, అహంకారముపై, మమకారముపై నాధారపడి జీవించుచున్నప్పుడు బాధలు కలుగుచున్నవనియు స్వానుభవముతో గుర్తించుము.

నిష్కామముగా, ఆశారహితముగా, క్రోధరహితముగా, నిరహంకారముగా, భేదభావనారహితముగా, ఆత్మభావముతోను ఉన్నప్పుడు నీకు సంతోషము, సహాయము, అనుగ్రహము, మోక్షసుఖమున్ను కలుగుచుండునను విషయమును మరువకుము.

"మమాత్మా సర్వభూతాత్మా" యనుకొనుము.

---

## భగవన్మహిమానుభవములు – దృఢవిశ్వాసము

భగవత్సంబంధమైన అనుభవములు కలిగినవారికిమాత్రమే భగవంతునిపై దృఢమైన విశ్వాసము నిలచును. దృఢమైన విశ్వాసము కలవారుమాత్రమే ప్రకృతిసంబంధమైన (ప్రపంచసంబంధమైన) దుఃఖముల నన్నిటిని సులభముగా దాటగల్గుదురు.

పరమాత్మపై దృఢమైన విశ్వాసము కలవారు స్త్రీ ధనాది వస్తువులకు, సుఖదుఃఖములకు, స్తుతినిందలకు, లాభ నష్టములకు, కామక్రోధాది గుణములకును చలించరు.

భగవంతుని మహిమావిశేషములు అనుభవములోనికి రాకుండుట (కనబడకుండుట) వలన సాధువులలో, సన్న్యాసులలో, భక్తులలో, వేదాంతులలో ననేకులు బ్రహ్మనిష్ఠానందమును వదలి వైరాగ్యసుఖమును జూరకొనలేక కీర్తి ప్రతిష్ఠలకు, స్త్రీ ధనాది భోగములకును బానిసలై చెడిపోవుచున్నారు.

శ్లో. అనన్యాశ్చిన్తయన్తో మాం ఏజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

అనియు, "దదామి బుద్ధియోగం తం యేన మాముయాపన్తి తే" అనియును, "సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్స్మృతిః జ్ఞాన మపోహనంచ" అనియును గీతలలో చెప్పెనుగదా!

1. మనము భగవంతుని స్మరించుచు కాలము గడుపుచున్నప్పుడు మనకు లేనివాటిని యిచ్చుచు ఉన్నవాటిని కాపాడినవాడు భగవంతుడేనని అనుభవమైనచో ఆయనపై విశ్వాసము మనకు కలుగును.

2. భగవంతుని పొందుటకు తగిన అనుకూల సాధనములైన గురువు లభించుట, ఏకాంతవాసము ప్రాప్తించుట, భోజన వసతియు సమకూరుట మొదలైనవి దేవుని అనుగ్రహమువలననే లభించినట్లు అనుభవమైనచో దేవునిపై విశ్వాసము పెరుగును.

3. భగవంతుని కృపవలననే నాకు స్త్రీ ధనాది విషయములపై విరక్తి జనించి భగవంతుని సదా మరువకయుండే

భాగ్యము కలిగినదని అనుభవముద్వారా తెలిసికొనినప్పుడును దేవునిపై విశ్వాసము యెక్కువగును.

4. సంకీర్తన చేయునపుడు జప, ధ్యాన నిష్ఠలలో కూర్చొని నప్పుడు అమృతధార హృదయములోనికి ప్రవహించి ఉప్పొంగు నట్లు దైవానందమును అనుభవించినచో దేవునిపై మనకు మరింత విశ్వాసము దృఢపడును.

5. మానవులవలనగాని, జంతువులవలనగాని బాధలు వచ్చి నపుడు భగవంతుడుండగా మనము భయపడనేల ? అను భావనా విశేషముతో ధైర్యము చెడకయున్నచో దేవునిపై విశ్వాసము స్థిరపడును.

6. తినుటకు తిండిలేక కడుపు కాలిపోవుచున్నను కట్టు కొనుటకు వస్త్రము లేకయున్నను, నివసించుటకు నివాసస్థలము దొరకకయున్నను మనస్సు చలించక జీవితముయొక్క భారము దేవునిపై యున్నదనియు, ఆ భగవంతుడే ఈ శరీరమును పోషించుకొనుననియును ధైర్యము, ఉత్సాహము, దైవానంద మున్ను మనకు యున్నచో ఆ భగవంతుడే నిజముగా ఈ శరీర మునకు కావలసినవాటిని సమకూర్చి పోషించుట ప్రత్యక్షముగా అనుభవమగును. దీనివలనకూడ దేవునిపై మనకు దృఢవిశ్వాస మేర్పడును.

7. మనశ్శాంతి లేనిసమయమున హృదయములో పిరికి తనము కలిగి అధైర్యరూప కెరటములు రెపరెపలాడు సమయ మునను, ధైర్యోత్సాహములు కలిగించునట్టి సత్య ధర్మ బోధలు గ్రంథములలో కనిపించినను, లేక యెవరైన సజ్జనుడు బోధించి పిరికితనమును పోగొట్టి వైరాగ్యమును కలిగించినను ఇది

భగవంతుని అనుగ్రహామువలననే జరిగినట్లు అనుభవములో స్థిర నిశ్చయ మేర్పడినచో మనకు భగవంతునిపై విశ్వాసము హెచ్చు వగును.

8. స్వప్నములోకాని, తన్మయస్థితిలోకాని భగవంతుడు కనబడినను, మాట్లాడినను మనకు పరమాత్మపై దృఢవిశ్వాసము మిక్కుటమగును.

9. దేహాభిమానమును వదలి, దేహసంబంధమైన కామ క్రోధ భయాది గుణములను త్యజించి అంతయును దేవునిదే, అంతయును భగవత్స్వరూపమే యను దృఢనిశ్చయదృష్టి కలిగిన వారే నిజమైన భగవద్విశ్వాసము కలవారనబడుదురని గ్రహించవలెను.

10. ధర్మసందేహములు కలిగి బాధ కలిగినపుడు భక్తితో గురువునుగాని, దేవునిగాని ప్రార్థన చేసినచో అంతరాత్మరూపముగానైనను, ఆకాశవాణిరూపముగానైనను ధర్మసందేహములను భగవంతుడు తీర్చును. ధర్మసందేహముతో పెద్దలదగ్గరకు పోయి కూర్చొని వారిపై భక్తిభావముతో మనస్సును సంలగ్నము చేసినచో వారివాక్కునుండి మన సందేహములను తీర్చెడి సద్ధర్మములు వెలువడును. అప్పుడుకూడ దైవభక్తియొక్క మహిమాతిశయము అనుభూతమై విశ్వాసము దృఢపడును.

11. వ్యాధులు బాధపెట్టుచున్నప్పుడు భగవంతునిపై భారమువేసి యెల్లప్పుడును సర్వేశ్వరుని స్మరించుచున్నచో ఆతడే తప్పకుండ మన వ్యాధులను నశింపజేయును. అప్పుడు కూడ మనకు దేవునిపై దృఢవిశ్వాస మేర్పడును.

ఈ విధముగా భగవన్మహిమల ననుభవపూర్వకముగా గుర్తించనిచో క్రమముగా భగవంతునిపై గల (ఇపుడున్న) విశ్వాసముకూడ క్షీణించిపోవచ్చును.

భగవన్మహిమలను గాంచనివారును, దైవానందము ననుభవించనివారును దుఃఖసముద్రములోనే అజ్ఞానచీకటిలోనే మునిగియుందురు. జీవులకు దైవచింతన, ధర్మాచరణలే ఆధారము.

---

## ఓర్పు - దాని ప్రభావము

శ్లో. మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యా స్తాం తితీక్షస్వ భారత ॥
( అ : 2, శ్లో. 14 )

చెవి యిష్టానిష్టశబ్దములతోను, దేహము ( చర్మము ) శీతోష్ణములతోను, నేత్రములు అందమైన రూపములతోను, భయంకరరూపములతోను, నాలుక రుచి అరుచులతోను, ముక్కు సువాసన చెడ్డవాసనలతోను సుఖమును దుఃఖమును అనుభవించును. ఇంద్రియములకు యీసుఖదుఃఖములు స్థిరముగా నుండక పుణ్య పాపముల ననుసరించి వచ్చుచు పోవుచు నుండును. కనుక భక్తులు, ముముక్షువులు, ఆత్మజ్ఞానమును, ఆత్మనిష్ఠను పొందనిచ్ఛగలవారును సుఖదుఃఖాదులకు చలించక ఓర్పుతో వైరాగ్యమును కాపాడుకొని మోక్షమార్గమున నడువవలెను.

ఓర్పులేనివారు దుఃఖములకు భయపడి పారిపోవుదురు. సుఖములకు దాసు లగుదురు. దుఃఖములకును, సుఖములకును

చలించకుండుటయే ఓర్పనబడును. ఓర్పులేని జీవితము కోతి జీవితమువలె చంచలమైనదనబడును. కోతిని చిన్న బాలురుకూడ చలింపజేయునట్లు ఓర్పులేనివారిని ప్రపంచములో చిన్నవస్తువు, చిన్నమాటకూడ చలింపజేయును. ఓర్పు (సహనము) అనగా సుఖమునకు స్తుతికి దుఃఖమునకు నిందకును చలించకుండుటయే యగును. ఈ సహనమనెడి పునాదిమీదనే ఆత్మనిష్ఠ, ఆత్మజ్ఞానమనెడి మేడను కట్టి అందులో నివసించి సుఖింప వీలుకలుగును.

సుఖదుఃఖాదులకు చలించువారి దృష్టి దేహముపై, ప్రపంచముపై నుండును. సుఖదుఃఖాదులకు చలించనివారి దృష్టి యన్ననో ఆత్మపై, సత్యముపై, బ్రహ్మముపై నుండును. గీతలో శీతోష్ణములను, సుఖదుఃఖములను, స్తుతినిందలను, శత్రుమిత్రులను, మట్టిగడ్డను బంగారమును సమముగా చూచువారే జ్ఞానులనియు, భక్తులనియు, ముక్తులనియును చెప్పబడినది. అభ్యాసి శీతోష్ణసుఖదుఃఖాదులను సహించి సాధన జేయవలెననికూడ చెప్పబడినది. నేలమీద నడచువారికే కుక్కలవలని భయముండునుగాని, ఏనుగుమీద కూర్చొనినవారికి కుక్కలవలని భయముండనట్లు, దేహమే నేనను దృష్టిగలవారిలోనే ఓర్పనశించి సుఖదుఃఖాదులు బాధించును. ఆత్మదృష్టిగలవారి నివి బాధించవు. పెరుగును కవ్వముతో మథనము చేయనిచో అందుండి వెన్న బయలుదేరనట్లు సహనముతో సత్యధర్మ మార్గమున నడువనిచో స్వస్వరూపాత్మను గాంచజాలరు.

వ్యవసాయము, వ్యాపారము లను చేయువారు చలి యెండలకు, గాలివానలకును భయపడి యింటిదగ్గరనే కూర్చొని యున్నచో ధనధాన్యములు లభింపనట్లు శీతోష్ణ సుఖదుఃఖ స్తుతి

నిందలకు చలించువారు సత్యధర్మములను ఆత్మదర్శనమును పొందజాలరు. లోకములో చలియెండలు, గాలివానలు, సుఖదుఃఖములు, స్తుతినిందలును గలవు. వాటిని ఉపాయములతో దాటవలెను. ఎట్లన మనము యెండవానలవలన శిరస్సునకు బాధ కలుగకుండుటకు గొడుగును వేసికొని మన పనులను నెరవేర్చుకొనుచున్నాము. ఎండలో కాళ్ళు కాలకుండుటకై చెప్పులను వేసికొని మన పనులను నెరవేర్చుకొనుచున్నాము. చొక్కాలను తొడుగుకొని, దుప్పట్లను కప్పుకొని చలిగాలులకు చలించక మన పనులను నేరవేర్చుకొనుచున్నాము. చీకటిలో దీపమును చేతబట్టుకొని మన పనులను నెరవేర్చుకొనుచున్నాము. ఈ విధముగానే వివేక వైరాగ్యములతో ఓర్పును సంపాదించుకొని సుఖదుఃఖములను, స్తుతినిందలను దాటి మోక్షమార్గమున నడచుచు పరమాత్మదర్శనమును పొందవలెను.

సుఖఃదుఖాదులను సహించనిచో కలుగు నష్టమేమనగాః కాశికి పోదలచువారు మధ్యమధ్య గ్రామాదులలో నివాసము చేయక వెళ్లుచున్నచో తొందరగా కాశికి వెళ్లగలరు. మధ్య మధ్య గ్రామాదులలో నివసించుచు ఆలస్యము చేయుచున్న కొలది కాశికి పోవుటకు యెక్కువకాలము పట్టునుగదా. ఇట్లే సుఖదుఃఖాదులకు చలించక ఆత్మనిష్ఠను సత్య ధర్మములను తప్పక ప్రవర్తించుచున్నచో యీ జన్మములోనే మనస్సునందున్న కామక్రోధాది గుణములను జయించి ఆత్మదర్శనమును (మోక్షమును) పొందుదురు. సుఖదుఃఖాదులకు చలించువారన్ననో దైవనిష్ఠను వదలినవారై క్రొత్తపాపములను సంపాదించుకొనినవారై కొన్నిజన్మల నెత్తవలసియుండును.

ప్రారబ్ధకర్మను ఓర్పుతో అనుభవించుచు క్రొత్తకర్మను సంపాదించుకొనక సత్యధర్మములను, దైవనిష్ఠను వదలకుండుటయే ముముక్షువుల ముఖ్యధర్మము.

ఓర్పు శాంతములో నిలబెట్టి క్రోధములోనికి జారనీయకుండ చేయును. ఓర్పు సత్యములో నిలబెట్టి అసత్యములోనికి పడనీయకుండ చేయును. ఓర్పు ధర్మమార్గములోనుంచి అధర్మమార్గములోనికి వెళ్ళనీయకుండ చేయును. ఓర్పు వైరాగ్యములోనుంచి భోగములలోనికి జారనీయకుండ చేయును. ఓర్పు సన్న్యాసములోనుంచి సంసారములోనికి జారి పడనీయకుండ చేయును. ఓర్పు దైవములోనుంచి ప్రపంచములోనికి మనస్సును రానీయకుండచేయును. ఓర్పు గౌరవములోనుంచి అగౌరవము గల్గు కార్యములలోనికి రానీయకుండ చేయును. ఓర్పులేని మానవునకు మోక్షమార్గము దొరుకదు. నైష్ఠికబ్రహ్మచర్యముతో నుండదలచిన మానవులలో అనేకులు ఓర్పులేకపోవుట వలననే వివాహము చేసికొనుచున్నారు.

ఇకనుండి నేను బ్రహ్మచర్యవ్రతము నవలంబించి యుండెదనని చెప్పిన గృహస్థులలో అనేకులు ఓర్పులేకపోవుటవలననే మరల భార్యతో కలయుచున్నారు. నా బంధుమిత్రులు, నా గృహము యను మమకారమును వదలి విరక్తితో వానప్రస్థాశ్రమమున నుండెదమని చెప్పిన స్త్రీ పురుషులలో అనేకులు ఓర్పులేకపోవుటవలననే మరల తమ బంధుమిత్రాదులతో సంబంధమును పెట్టుకొని మమకారముతో గృహములందు నివసించుచున్నారు. నాకు ప్రపంచముతో పనిలేదు, దేవుని నొక్కనినే నమ్మియుండెదనని గట్టిగా చెప్పిన భక్తులలో అనేకులు ఓర్పులేక

పోవుటవలననే మరల ప్రపంచములోనికి దిగి ప్రపంచమునే శరణు పొంది యుంటున్నారు. కాషాయవస్త్రములను ధరించు సన్న్యాసులలో కొందరు ఓర్పులేకపోవుటవలననే కాషాయవస్త్రములను తీసిపారవేసి వివాహము చేసికొనుచున్నారు. మిత సాత్త్వికాహారమును భుజించెదనని నియమము నవలంబించి యున్నవారలలో ఓర్పులేకపోవుటవలననే మరల అధిక భోజనము, అసాత్త్వికాహారభక్షణములలోనికిని దిగుచున్నారు.

---

## దూషణపడుటలో మేలు

గీత ద్వాదశాధ్యాయములో "సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః" అనియు "తుల్యనిందాస్తుతిర్మౌనీ" యనియును భగవంతుడు చెప్పెను. అనగా శత్రుమిత్రులను స్తుతినిందలను సమముగా చూచినవాడే నాకు ప్రియుడగునని తాత్పర్యము.

"అసమ్మానా త్తపోవృద్ధి స్సమ్మానా త్తపసః క్షయః"

ఇతరులచే గౌరవింపబడినచో మన తపశ్శక్తి, పుణ్యమును నశించును. ఇతరులచే మనము నిందింపబడినను, గౌరవింపబడకపోయినను మన తపశ్శక్తి, పుణ్యమును, ధైర్యశక్తియు వృద్ధియగును అని శాస్త్రము చెప్పెను.

నన్ను దూషించినవాడు నా తల్లిదండ్రులకన్నను అధికప్రియుడు. ఎందువలన ననగా పాప మతడు తాను మునిగిపోయి నన్ను సంసారసముద్రమునుండి తరింపజేయుచున్నాడు అని నాబ్రాహ్మహోశయు డనెను. నన్ను దూషించుచు, నన్ను

విమర్శనచేయుచు నా సోదరులు సంతోషించుచున్నారు. ఆహా! నావలన నా సోదరులు సంతోషమొందుచున్నారుగదా యని ఒక మహనీయు డనెను.

"ఎవరూ దూషించిననేమి, మెచ్చి ఎవరూ భూషించిన నేమి, నవనీతచోరుడు నారాయణుడుండంగ" అనియు "అపకారమెంచువారూ మాకు ఉపకారులై యున్నవారు" అనియును భద్రాచల రామదా సనెను. నా భక్తులను పలు విధములుగా కష్టములబెట్టి చివరకు నాలో చేర్చుకొందునని భాగవతములో విష్ణు వనెను. ప్రకృతివికారములకు చలించ కుము, స్వస్వరూపాత్మను మరువకుము అని ఉపనిషత్తులు చెప్పు చున్నవి. ఎన్నికష్టనష్టములు ప్రాప్తించినను సత్యాత్మను భగవంతుని మరువకుము, సద్ధర్మములను తప్పకుము యని జీవిత చరిత్రలు చెప్పుచున్నవి. ఇదే చరిత్రములో గల సారము.

దూషణలకు హేతువైన చెడ్డపనులను చేయరాదు. సద్గుణవంతుడు సజ్జనులకు ప్రియుడుగను, దుర్జనులకు అప్రియుడు గను యగును.

సత్యధర్మములను తప్పక నడచువారికి పలువిధములైన కష్టనష్టములు ప్రాప్తించును. కనుక ముముక్షువులును, భక్తులును, ప్రకృతి ప్రపంచమునకు చలించకుండుట పరమధర్మమై యున్నది.

పరులవలన గల్గు దూషణ భూషణములు ఆత్మపరీక్షకు అనుకూలముగా నుండును. దూషణ భూషణలలోనే మనలో నెంత ప్రకృతిమాయ యున్నదియు తేటయగును. స్తుతినిందలు వచ్చుటవలన మనము సత్యమైన ఆత్మలో నున్నామో, అనిత్య మైన దేహము నంటుకొని యున్నామో యను విషయము

స్పష్టముగా తెలియబడును. దీనివలన మనము జ్ఞానులమైనదియు కానిదియు తెలియును. అహంకారమును సన్నగిల్లును.

ఇతరు లెంత దూషించినను మనముమాత్రము యితరులను దూషించరాదు. మనము మంచివారమనిగాని, చెడ్డవారమని గాని చెప్పుకొనరాదు.

సత్యాత్మను నమ్మినవాడై సుఖదుఃఖములకును, స్తుతి నిందలకును చలించనివాడే ఆత్మసాక్షాత్కారజ్ఞానము నొంది మహాత్ము డను పేరుతో ప్రకాశించును.

మనము దైవచింతనతో కూర్చొని కాలము గడుపు చున్నప్పుడు మనలను యితరులు చూచి వీరు సోమరు లనియు, దొంగభక్తు లనియును నిందించినచో మనలో నిజముగా సోమరితన మున్నదా ? దైవచింతన లేకనున్నామా ? యని ఆత్మపరీక్ష చేసి కొనుచు, మన తప్పులను మనము చూచుకొనుటకు వీరు సహా యము చేయుచున్నారని కృతజ్ఞత చూపవలెనేగాని వారిని కోపముతో చూడరాదు.

మనము కాషాయవస్త్రములను ధరించి భిక్షకొరకుగాని, ధర్మబోధ చేయుటకొరకుగాని గ్రామమునకు వచ్చినపుడు యితరులు మనలను జూచి వీరు పొట్టకూటికై, ధనసంపాదన కొరకై వేషము వేసికొని తిరుగుచున్నారని నిందించినచో నిజముగా మనము దేవునినమ్మి తిరుగుచున్నామా, భోజనము కొరకును,ధనముకొరకును వేషముధరించి తిరుగుచున్నామా?యని ఆత్మపరీక్ష చేసికొనవలెను. ఈ దూషణ ఆత్మపరీక్ష చేసికొనుమని మనకు చెప్పుచున్నట్లు భావించవలెనేగాని వారిని కోపించరాదు.

మనము దైవచింతన, లోకసేవాచింతన చేసికొనుటకు మిక్కిలి యుపయోగపడునని తలంచి మౌనవ్రతమును మన మవలంబించియున్నచో మనలను యితరులు చూచి వీరు తమ్ము గొప్పమహాత్ములని అనిపించుకొనుటకును, యితరులచే గౌరవము, పూజ్యత నొందుటకును కొంగజపముతో సోమరులై మౌన మవలంబించియున్నారు. ఇంతమాత్రమున వీరు మునులేనా? మహాత్ములేనా? యని దూషణగా మాట్లాడుచున్నచో నిజముగా మనము దేవుని నమ్మి మౌనవ్రతము ధరించుచున్నామా? కపట బుద్ధితో, గౌరవాపేక్షతో మౌనమును ధరించి కాలము గడుపుచున్నామా? యని ఆత్మపరీక్ష చేసికొనవలెనేగాని ఆ దూషించిన వారిపై కోపము చూపరాదు.

మనము భజనలు, పూజలును చేయుచున్నపుడు యితరులు చూచి వీరు తమ్ము గొప్ప భక్తులనీ, గొప్పగా పాడెడువారనీ యితరులు మెచ్చుకొనవలెనని పాడుచున్నారేగాని వీరికి నిజమైన దైవభక్తిగలదా? యని యితరులు విమర్శనల చేయుచు మాట్లాడినచో నిజముగా మనము భగవంతునిపై దృష్టినుంచి భజనలను చేయుచున్నామా? గౌరవాపేక్షతో గౌరవముపై దృష్టినుంచి భజనచేయుచున్నామా? యని ఆత్మపరీక్ష చేసికొనవలెనేగాని యితరులను కోపించరాదు.

పుస్తకములను చేతిలోనుంచుకొని తాము గొప్ప వేదాంతులమని, పండితులమని చెప్పుకొనుచు తిరుగువారును గలరు. ఇదియు అసత్యవర్తనయే యగును.

దైవమును మరువకుండుట, ధర్మమును తప్పకుండుట యను యీ రెండే ఉత్తమపురుషుల లక్షణమైయున్నది.

ఆతరు లెంతదూషించినను పైకి చలించక యుండవలెను. చలించుట బలహీనత యగును. హృదయ మెంతకష్టపడుచున్నను అది మనము చేసికొనిన కర్మమేయనియు, కర్మనశించినపుడే హృదయము శాంతి శుద్ధము నగుననియు, ఆత్మ నిర్వికారము, మనస్సు వికారవంతమైనదనియును తెలిసికొని నిశ్చలత నొందుటకు సర్వదా ప్రయత్నము చేయుచుండవలెను.

ఇసుకరేణువంతటి మానవుని (జీవుని) బ్రహ్మాండమంతటి గొప్పవానినిగాచేసి శాశ్వతానందము నొందించునదే వేదాంత జ్ఞానమని గుర్తించి, అల్పమైన శరీరమునకు గల్గు సుఖదుఃఖ, స్తుతి నిందలకు చలించక అనంతాత్మదృష్టితో ఆనందమున మునిగి యుండవలెను. అనేకత్వములో దుఃఖమును, ఏకత్వములో సుఖమును గుర్తించి మెలగవలెను. ఇదియే ముముక్షువుల ధర్మము.



## దేహ మనిత్యమని తెలిసినదా ?

"జాతస్యహి ధ్రువో మృత్యుః" అని అందరున్ను చెప్పుచున్నారు. అనగా పుట్టిన శరీరము చచ్చిపోవుట నిశ్చయమని తాత్పర్యము. దేహమన్నను, మనస్సన్నను ఒకటియే యని గ్రహించుకొందము. మనస్సున్ను, దేహమున్ను పంచ భూతముల మయమేగదా! మనస్సునకు కష్టము కలిగినచో దేహము కృశించిపోవును. దేహమునకు దెబ్బలు, కురుపులు రూపముగా కష్టములు వచ్చినచో మనస్సు కృశించిపోవుచున్నది గదా !

దేహము అనిత్యమైనదని అవివేకులుకూడ చెప్పుదురు. పాపము వీరికి దైవము నిత్యమను నమ్మిక యుండదు. కొంత వివేకముగలవారికి దేహ మనిత్యమైనదనియు, ఆత్మ నిత్యమైనదనియును తెలియును. కాని, ఈ తెలివి స్థిరముగా నుండుటలేదు. ఆత్మదర్శనముగల మహాత్ములకుమాత్రమే దేహ మనిత్యమనియు, ఆత్మయే నిత్యమైనదనియు, స్థిరబుద్ధి యుండును. అందువలననే ఆ మహాత్ములు యేకాలమునందును సుఖదుఃఖములకు, స్తుతినిందలకు చలించక కామ క్రోధములు లేనివారై నిత్యానందములో సర్వదా మునిగియుంటున్నారు.

ఆత్మజ్ఞానములేని సాధువులకు, భక్తులకు, వేదాంతులకును కొంచెముగానే దేహ మనిత్యమని, ఆత్మ నిత్యమైనదని తెలియును. పూర్తిగా దేహాత్మల తత్త్వము ను గుర్తించిననాడే మనము దుఃఖసాగరమును దాటినవార మగుదుము. దేహబుద్ధి నశించి, ఆత్మబుద్ధి సర్వదా నిలిచియున్నచో మన తపస్సు ఫలించినదని చెప్పవచ్చును. శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయములతో మన మనస్సు సుఖ దుఃఖముల రూపముగా చలించుచున్నంతవరకును మనకు పూర్తిగా దేహ మనిత్యమైనదని తెలియలేదనియే గ్రహించుకొనవలెను.

చక్రవర్తులకు బిక్షమెత్తుకొని భుజించుటకు ప్రీతి లేకుండునట్లు పంచభూతములకు ఆదికారణమైన పరమాత్మను సాక్షాత్కరించుకొనిన మహాత్ములకు పంచభూతమయమైన శబ్దాది విషయములకు చలనము కలుగదు. (విషయ సుఖములను కోరరు.)

శబ్దాది విషయములలో గల రాగద్వేషములు తగ్గుచున్న కొలది సాధకులకు ఆత్మసుఖము వృద్ధియగుచుండును.

దేహ మనిత్యమైనదనియు, ఆత్మయే నిత్యమైనదనియు ఎల్లప్పుడున్ను భావించుటయే తపస్సనియు, జప ధ్యానము లనియును తెలియవలెను. దీపము ఆరిపోయినచో చీకటి ప్రవేశించునట్లు ఆత్మచింతన పోయినవెంటనే మనస్సు శబ్దాది విషయములలోనికి జొరబడును. సాధనకాలములో శబ్దాది విషయ సుఖములకు దూరముగా నుండవలెను. కొంత ఆరూఢత్వము కలిగిన తరువాత ఆత్మకంటె అన్యముగా శబ్దాది విషయములు లేవని అఖండభావన చేయవలెను. అనగా మొదట ప్రకృతి ప్రపంచమునకు భయపడి స్త్రీ ధనాది విషయములకు దూరముగా నుండవలెను. రెండవసారి స్త్రీ ధనాది ప్రపంచవిషయములను పరమాత్మలో లయింపచేయవలెను. మూడవసారి పరమాత్మకంటె భిన్నమైనది లేనేలేదని గ్రహించి సమస్తమునున్ను స్వాత్మమయముగా ప్రేమించవలెను. ఇదే దేహ మనిత్యమైనదనీ, ఆత్మ నిత్యమైనదనియు పూర్తిగా గ్రహించినదానికి ఫలమగును. స్త్రీసుఖముపై, ధనసంపాదనపై, కీర్తిసంపాదనపై, శిష్య సంపాదనపై మోహ మున్నంతవరకు దేహ మనిత్యమైన దను విషయము తెలియలేదనియే గ్రహించవలెను. భేదదృష్టిలోనే భ్రాంతులు కలవు. ఆత్మ అభేదస్వరూపము. దేహము భేద స్వరూపము. దేహదృష్టిలోనున్నంతవరకును, భేదభావములు తప్పక యుండును. ఆత్మదృష్టి కలిగినతరువాత బలవంతముగా భేదదృష్టిని కలిగియుండదలంచినను లభించదు ; నిలువదు.

పంచకోశములు పంచభూతమయమగుటచే పంచ కోశములలోగల వికారగుణములను క్రమముగా దాటిపోయినచో

దేహమును దాటి ఆత్మను పొందినట్లే యగును. పంచకోశములను దాటనిదే అనేకులు దాటితిమని గర్వపడుచు చెడిపోవుచున్నారు. దేహదృష్టిలో నుండియు అనేకులు ఆత్మదృష్టిలోనున్నట్లు తలంచుచున్నారు. సంసారములో నుండియు అనేకులు సన్న్యాసులమైతిమని తలంచుచున్నారు. ద్వంద్వములలో నుండియు అనేకులు ద్వంద్వాతీతుల మైతిమని తలంచుచున్నారు. శిష్యులుగా నుండియు అనేకులు గురువులుగా నున్నామని చెప్పుచున్నారు. అజ్ఞానములోనే పడియుండియు అనేకులు జ్ఞానులమైతిమని భ్రమ పడుచున్నారు.

అహంకారము నశించనిదే అఖండాత్మ గోచారముకాదు. సంకల్పములు నశించనిదే సంసారము నివర్తించదు. శరీరదృష్టి నశించనిదే ఆత్మదృష్టి యలవడదు. తపస్సు చేయనిదే మానసాదింద్రియములు శుద్ధముగావు. విచారణ చేయనిదే యథార్థము తెలియబడదు.

దేహ ధనాది వస్తువులు, రాగద్వేషాది గుణములు, స్తుతి నిందాది శబ్దములున్ను సాధారణముగా నందరకును అనిత్యమైనవను విషయము తెలిసియే యున్నదిగదా ! ఇప్పుడు తెలిసిన విషయములను వదలిపెట్టినచో తెలియని పరమాత్మ కనబడును.

## దేహము - ఆత్మజ్యోతి

దేహసుఖముపై విరక్తియు, ఆత్మసుఖముపై రక్తియు నుంచుటయే ముముక్షువుల ముఖ్యకర్తవ్యము.

దేహాభిమానము నశించి ఆత్మదృష్టికలుగుటకు స్వధర్మాచరణ తప్పకనడచుటకంటె గత్యంతరము మరియొకటి లేదు.

అగ్ని వేడికి బెల్లము కరిగిపోవునట్లు స్వధర్మాచరణతోనే దేహామే నేను అను అభిమానము కరిగిపోవును.

దేహాము పాలవంటిది. ఆత్మ నేయివంటిది. పాలయందు నెయ్యి యున్నట్లు దేహామందు శాశ్వతమైన ఆత్మజ్యోతి యున్నది.

పాలలోగల నెయ్యిని వేరుచేసిచూచుటకుగాను మొదట పాలను అగ్నివేడిపై కాచవలెనుకదా! తరువాత తోడు వేయగా క్రమముగా గడ్డకట్టుకొని పెరుగు యగును. తరువాత ఆ పెరుగును కవ్వముతో తరచగా వెన్న బయలుదేరి వేరగును. ఆ వెన్నను కాచగా అందులోగల నీరు నశించి నెయ్యి యగును గదా!

అట్లే పాలవంటి శరీరము పుణ్యకర్మలు, పెద్దల సేవ యనెడి అగ్నిపై వేడి కావలెను. (అనగా పవిత్రము కావలెను). శుద్ధమైన శరీరము (హృదయము) లో మంత్రోపదేశమనెడి తోడు వేయగా బాహ్యవిషయములవైపునకు పోయి పలచగా నున్న మనస్సు కొంత అంతర్ముఖమై నిలకడచెందును. (గడ్డ కట్టుకొనును). నిలకడజెందిన పెరుగువంటి మనస్సును విచారణ యనెడి కవ్వముతో తరచగా (ఈ లోకములో ఈ శరీరములో నిత్యమైన దేది? అనిత్యమైన దేది? అని విచారణ చేయగా) మజ్జిగ, వెన్నయు వేరైనట్లు మజ్జిగవంటి ఈ శరీరము నేను (ఆత్మ) కాదు. వెన్నవంటి ప్రత్యగాత్మయే (జీవుడే) నేను అను అనుభవజ్ఞానమనెడి వెన్న వేరగును.

జీవజ్ఞానమనెడి వెన్ననుకూడ విచారణయనెడి అగ్నితో వేడిచేయగా జీవుడను నేనుగాను, సర్వత్ర నిండి వెలుగుచున్న

పరమాత్మయే (పరబ్రహ్మమే) నేను అనెడి అనుభవము (నెయ్యి) మిగులును. ఆ నేతికికూడ అగ్నిని ముట్టించినచో నామరూపములు కూడ లేకుండ పోవునట్లు నేను పరబ్రహ్మనై యున్నాననెడి తలంపునుకూడ దాటినచో సహజామనస్కస్థితిలో బ్రహ్మానంద మయుడై నెలకొనియుండగల్గును. ఇదియే కైవల్యమోక్షము.

పచ్చిపాలను కాచుట మొదటిపని. కాచిన పాలలో తోడువేయుట రెండవపని. పెరుగును తరచుట మూడవపని. వెన్నను కాచుట నాల్గవపని. నేతికి జ్యోతిని ముట్టించుట ఐదవపని.

ఇట్లే మోక్షసుఖము నొందతలంచిన మానవునకు ధనముతో మనోవాక్కాయములతోను పుణ్యకర్మలను చేయుట ప్రథమ స్వధర్మమగును. మంత్రోపదేశమొందుట రెండవ స్వధర్మము. నిరంతరమును మంత్రమును జపించుచు సంకీర్తన చేయుచు దృష్టిని అంతర్ముఖము చేసికొనుట మూడవ స్వధర్మమగును.

ఆత్మానాత్మ (నిత్యానిత్య) విచారణచేయుట నాల్గవ స్వధర్మము.

విచారణద్వారా మనస్సును నిగ్రహించి ఆత్మచింతన చేయుట ఐదవ స్వధర్మమగును.

ఆత్మనిలకడద్వారా సర్వమును బ్రహ్మమే యని సంభావించుచు నిలకడచెందుట ఆరవ స్వధర్మమగును.

పాలకు జ్యోతిని ముట్టించదలంచిన ముట్టుకొనదు. ఇట్లే పెరుగునకును, వెన్నకునుకూడ ముట్టుకొనదు. నేతికిమాత్రమే

జ్యోతిని ముట్టించిన ముట్టుకొనును. ఈ విధముగానే ధనముతో, శరీరముతో, వాక్కుతోను పుణ్యకార్యముల జేసినంతమాత్రమున మహావాక్యోపదేశము పట్టుబడదు. మనోనిశ్చలతగలవారికి మాత్రమే మహావాక్యమను జ్యోతి ముట్టుకొనును.

---

## భర్తకు భార్య జ్ఞానబోధ చేయవచ్చునా?

శ్లో॥ పతిరాత్మా పతిర్విష్ణుః ప్రతిర్బ్రహ్మ పతిశ్శివః।
పతిర్గురుః పతిస్తీర్థ మితి స్త్రీణాం విదు ర్బుధాః॥

ప్రశ్న : స్వామీ! భర్తయే ఆత్మ, భర్తయే విష్ణువు, భర్తయే శివుడు, భర్తయే గురువు, భర్తయే పుణ్యతీర్థము అని చెప్పుట వినుచున్నాము. భర్తమాటకు భార్య యెదురు చెప్పకూడదనియు, భర్తచెప్పిన పనులనన్నిటిని భార్య చేయు చుండవలెననియు పెద్దలు చెప్పుచున్నారుగదా. భర్త దుర్గుణ ములతో దుష్టపనులను చేయుచున్నప్పుడు భర్తకు భార్య జ్ఞాన బోధచేయవచ్చునా?

ఉత్త : భార్య చెప్పిన మంచిమాటలను భర్త వినునో? లేదో? యని కొంతకాలము విచారించి వినగలడను విశ్వాసము దృఢముగా నున్నపుడు బోధించి చూడవచ్చును.

ప్రశ్న : భర్తకు భార్య జ్ఞాన వైరాగ్యాది ధర్మములను బోధించునట్లు చరిత్ర లేమైనను నుండినయెడల దయయుంచి వినిపించగోరెద.

ఉత్త : 1) పంచపాండవులు కౌరవులను చంపినతరువాత బంధు మిత్రాదులను చంపించితినిగదా యని ధర్మరాజు దుఃఖ

పడుచు నాకు రాజ్యము వలదు, నేను సన్న్యాసినై భిక్ష మెత్తుకొని భుజించుచు జీవితమును గడపెదనని చెప్పగా ద్రౌపది దేవి ధర్మరాజునకు రాజధర్మములను బోధించినట్లు భారతము శాంతిపర్వమునందు కలదుగదా.

2) జనకమహారాజుకూడ వైరాగ్యదృష్టి కలవాడై రాజ్యమును వదలి భిక్షమెత్తుకొని భుజించుచు తపస్సు చేసికొందు నని నిశ్చయము చెప్పగా, జనకుని భార్య రాజధర్మములను చెప్పి వారింపజేయలేదా! (శాంతిపర్వము)

3) శిఖిధ్వజ మహారాజు విరక్తి దృష్టితో రాజ్యమును వదలి ఒక మహారణ్యమునకు పోయి తపోవృత్తితో నుండెను. అపుడు ఆయన భార్యయగు చూడాల విరక్తిని జ్ఞానబోధ చేసి మరల ఇంటికి తీసికొనివచ్చి రాజ్యపరిపాలన చేయుమనెను. నిశ్చయబుద్ధితో భర్తయున్న మహారణ్యమునకు వెళ్ళి రాజ్య పరిపాలన చేయుట వదలి ఈ వనములో నివసించుట నిజమైన వైరాగ్యము కాదని ఆక్షేపించెను.

అపుడు రాజు ఇట్లనెను :

శ్లో॥ రాజ్యం త్యక్తం గృహంత్యక్తం దేశస్త్యక్త స్తథాఖిలః
దారాస్త్యక్తా స్సుతాస్త్యక్తా స్సర్వత్యాగో [illegible]

తా॥ నేను రాజ్యమును వదలితిని. గృహమును వదలి పెట్టితిని. దేశమును త్యజించితిని. భార్యను విడచితిని. బిడ్డ లను విడచివేసితిని. ఇంతకంటే త్యజించవలసినది [illegible]?

శ్లో॥ కేనాయంచాల్యతేదేహః కిం బీజం [illegible]
కస్మిం స్త్యక్తే పరిత్యక్తం సర్వం భవతి [illegible]

తా॥ ఓ సౌందర్యనిధీ! దేనిచేత ఈ దేహము [illegible]

జరుగుచున్నది ? ఏది జన్మములకు కర్మలకును మూలమగును? దేనిని విడచినయెడల సర్వత్యాగము సిద్ధించినట్లగును ?

చూడాల సమాధాన మేమనగా:

శ్లో॥ జన్మనాం కర్మణాంవాఽపి చిత్తం బీజ ముదాహృతం।
పాదపః పవనేనైవ దేహశ్చిత్తేన చాల్యతే॥

చిత్తత్యాగం విదు స్సర్వ త్యాగం త్యాగవిదో జనాః
చిత్తే త్యక్తే లయం యాతి ద్వైత మైక్యం చ సర్వతః॥

శిష్యతే పరమంశాంత మేకమచ్ఛమనామయం
సర్వత్యాగః పరానందో దుఃఖ మన్య త్సుదారుణమ్॥

తా॥ జన్మలకును కర్మలకును చిత్తమే విత్తనబడుచున్నది. గాలికి వృక్షము కదలుచున్నట్లు చిత్తముచేతనే దేహము కదలుచున్నది. చిత్తమును (మనశ్చలనమును) త్యాగముచేయుటయే నిజమైనత్యాగ మనబడునని త్యాగము యొక్క నిజము తెలిసిన పెద్దలు చెప్పుచున్నారు. చిత్తమును విడిచినప్పుడే నేను, నీవు, నాది, నీది యను భేదభావములన్నియు నశించును. చిత్తత్యాగముచే శాశ్వతమైన పరమశాంతి లభించును. సర్వత్యాగమే పరమానందము. తక్కినవి గొప్ప దుఃఖరూపములే యగును.

ఈ విధముగా చూడాల తనభర్తకు బోధించి స్వగృహమునకు తీసికొనివెళ్లి రాజ్యపరిపాలన భారమును మీద పెట్టెను. రాజు జ్ఞానవంతుడగుటచేత జనకమహారాజువలె రాజ్యమును పరిపాలించెను.

4) శ్రీ బుద్ధదేవుని దగ్గరకు భక్తురాలగు ఒకరాణి వెళ్లుచు ఆ మహాత్ముని ధర్మబోధనలను శ్రవణముచేసి వచ్చుచుండెడిది. ఆమె భర్తయగు రాజుగారికి కోపమువచ్చి భార్యను తిట్టుటయే గాక శ్రీ బుద్ధభగవానునికూడ దూషణగా మాట్లాడుచుండెడి వాడు. ఒకనాడు రాణీగారు రాజుగారినికూడ తన మార్గమున త్రిప్పదలచి రాజును సమీపించి, నాథా! మనము ఏ యే వస్తువులను, జీవులను ప్రియమైనవిగా తలంతుమో అవన్నియును దుఃఖకారణములగునని బుద్ధభగవానులు సెల విచ్చిరి అని చెప్పెను. అపుడు రాజుగారు సంపాదించు కొనిన ప్రతిదీ సుఖమునకు కారణమగునేగాని దుఃఖమునకు కారణము కాదని విపరీతముగా పలికెను. అపుడు రాణి రాజుగారి నిట్లు ప్రశ్నించెను :

రాణి : నాథా! మన కుమార్తెయగు వజ్రిణి మీకు ప్రియమైనదేనా?

రాజు : మల్లికా! ఏమట్లందువు. ఏకైకపుత్రికగదా! మిగుల ప్రియమైనది.

రాణి : నరపాలా! ఆ కుమార్తెకు ఏదైన సంకటము కలిగినను, చెడుకలిగినను మీకు చీకు దుఃఖము ఆయాసములు కలుగునా?

రాజు : ప్రియురాలా! అది ఇది యేమిటి. ప్రాణములు నిలుచునో, నిలువవో.

రాణి : నాథా! అందువలననే శ్రీ బుద్ధదేవుడు, దుఃఖములన్నియు ప్రియవస్తువులవలన గలుగునని చెప్పెను. నాథా! మీ సేనాపతి (మంత్రి) మీకు ప్రియుడేనా?

రాజు : మల్లికా! అతురాలా ప్రియుడే.

రాణి : ప్రభూ ! ఆయనకు ఏదైనా సంకటము వాటిల్లినచో, చెడుగు దాపురించినచో మీకు చింతలు క్లేశము దుఃఖములు సంభవింపవా ?

రాజు : వెయ్యేల నేను జీవించుటయే సందేహామగును.

రాణి : మహారాజా ! అందుకే బుద్ధుడు చింతలును, దుఃఖములును ప్రియవిషయములచే కలుగునని చెప్పుటకు కారణమైనది.

కోసలేశ్వరా ! ఈ పట్టణములోని ప్రజలు మీకు ప్రియ పాత్రులేనా ?

రాజు : ఆహా ! అవశ్యము. ఈ సుఖభోగములకు కారణము వారి శ్రేయస్సేగదా !

రాణి : భూపాలా ! ఆ ప్రజలు కడగండ్లకు ( కష్టాలకు ) గురియగుచో ?

రాజు : ప్రేయసీ ! ఏమట్లందువు. నా జీవితసౌధము నకు పిడుగుపాటు.

రాణి : భూనాథా ! బుద్ధుడు బూటకములాడువాడా. పోనిమ్ము. మహారాజా, నేను మీకు ప్రియురాలనేనా ?

రాజు : చెలీ ! ప్రియురాలవేమిటి, ప్రియతమురాలవు.

రాణి : నాథా ! నాకేమైన చేటు మూడినచో ?

రాజు : ఛీ ఛీ ! అమంగళము శాంతించును గాక ! దేవీ ! నా ప్రాణములు నీతోడివై యున్నవి.

మంచెదరేల ! ఈ ప్రీతిని త్రిభువనమోహనుడైన ఆ శ్రీరామ చంద్రునిపై నుంచినయెడల సంసారభీతి (జనన మరణ భీతి) నశించిపోవును. అని చెప్పగనే తులసీదాసుగారి మనసు గిఱ్ఱున శ్రీరామప్రభువుపైపునకు తిరిగినది. వెంటనే అచట నుండి కాశీక్షేత్రమునకు వెడలిపోయి శ్రీరామధ్యానము చేసి శ్రీరామదర్శనము నొంది గొప్ప మహాత్ముడయ్యెను.

(6) రామాబాయి భర్త చెడువర్తన గలవాడు. ఆయన చెడువర్తనమును మాన్పించి మంచిప్రవర్తన గలవానినిగా రామాబాయి మార్పుచేయించ దలచి ఒక ఏకాదశిరోజున ఉపవాసవ్రతముతో నుండెను. ఆనాడే తన భర్త ఒక మేకను తెప్పించి కోయించి వంటవానిని కూర వండమని చెప్పెను. ఇంతలో రామాబాయి తన కుమారునకు విషముపెట్టి చంపెను. అపుడు తన భర్త మితిలేని దుఃఖములో మునిగి విలపించు చుండెను. అపుడు మెల్లగా రామాబాయి భర్తదగ్గరకు వచ్చి ఎందుకు మీ రేడ్చెదరు ! చచ్చినవాడు మరల బ్రతుకునా యని చెప్పినను అదేపనిగా దుఃఖపడుచునే యుండెను. కొంతసేపైన తరువాత రామాబాయి భర్తతో దేవాలయమునకుపోయి భక్తుల దగ్గర శ్రీహరి ప్రసాదములను తీసికొనివచ్చి చచ్చియున్న పిల్లవాని నోటిలో వేయుము బ్రతుకునేమో యని చెప్పెను. భార్య మాటయందు నమ్మకము లేకపోయినను చేసి చూత మనుకొని దేవాలయమునకు వెళ్లి భక్తుల నడిగి తీర్థప్రసాదములను తీసి కొనివచ్చి చచ్చియున్న పిల్లవాని నోటిలో వేయగానే నిద్రనుండి లేచినవానిలాగా బ్రతికి లేచెను. అపుడు భగవద్భక్తుల మహిమ విశేషములను భర్త గుర్తించి చెడువర్తనములను వదలి పరమ భక్తుడయ్యెను.

(7) సక్కుబాయియొక్క శ్రీ పాండురంగ భక్తి ప్రభావముచేతనే ఆమె భర్త, అత్తయును భక్తులైరిగదా.

(8) నాస్తిక భావముతో కాముకుడై యున్న లీలాశుకుడు చింతామణియొక్క హితోపదేశములను విని భగవంతుని భజించి పరమభాగవతోత్తముడై గ్రంథకర్తకూడ నయ్యెనుగదా.

ఈ విధముగా భర్తలకు జ్ఞానవైరాగ్యాది ధర్మబోధలను చేసి పరమపవిత్రులనుగా తయారుచేసిన (మార్చివేసిన) మహాతల్లుల చరిత్రలు అనేకములు కలవు.

ఆ. తనదు బాగు గోరి ధర్మంబు జెప్పిన
దిట్టుచుండు నధము డెట్టయెదుట
గడ్డివేయ బోట్లగొడ్డు కొమ్మూడించు
విశ్వదాభిరామ వినురవేమ.

ఆ. సాటివారు నిన్ను సాధింపగాలేరు
ధర్మ మెపుడు నీవు తప్పకున్న
భారతంబులోని పరమార్థ మిదెగదా
విశ్వదాభిరామ వినురవేమ.

భర్త మంచివాడుకాదని భార్య చింతపడ నవసరములేదు. అట్లే భార్య మంచిదికాదని భర్త చింతించనవసరములేదు. ఎవరికి వారే ధర్మవర్తనులై యున్నయెడల జీవితము విజయ మొందును.

రాజు : మల్లికా! అతురాలా ప్రియుడే.

రాణి : ప్రభూ! ఆయనకు ఏదైనా సంకటము వాటిల్లినచో, చెడుగు దాపురించినచో మీకు చింతలు క్లేశము దుఃఖములు సంభవింపవా ?

రాజు : వెయ్యేల నేను జీవించుటయే సందేహామగును.

రాణి : మహారాజా! అందుకే బుద్ధుడు చింతలును, దుఃఖములును ప్రియవిషయములచే కలుగునని చెప్పుటకు కారణమైనది.

కోసలేశ్వరా! ఈ పట్టణములోని ప్రజలు మీకు ప్రియ పాత్రులేనా ?

రాజు : ఆహా! అవశ్యము. ఈ సుఖభోగములకు కారణము వారి శ్రేయస్సేగదా!

రాణి : భూపాలా! ఆ ప్రజలు కడగండ్లకు ( కష్టాలకు ) గురియగుచో ?

రాజు : ప్రేయసీ! ఏమట్లందువు. నా జీవితసౌధము నకు పిడుగుపాటు.

రాణి : భూనాథా! బుద్ధుడు బూటకములాడువాడా. పోనిమ్ము. మహారాజా, నేను మీకు ప్రియురాలనేనా ?

రాజు : చెలీ! ప్రియురాలవేమిటి, ప్రియతమురాలవు.

రాణి : నాథా! నాకేమైన చేటు మూడినచో ?

రాజు : ఛీ ఛీ! అమంగళము శాంతించును గాక! దేవీ! నా ప్రాణములు నీతోడివై యున్నవి.

రాణి : స్వామీ ! నాథా ! ఇంతవరకు విచారించియే బుద్ధభగవానుడు శోక దుఃఖములన్నిటికిని ప్రియవస్తువులే కారణములగునని సెలవిచ్చెను.

రాజు : మల్లికా, ఒహోహో ! అద్భుతము. ఆ చురుకు చూపుకు చొరరాని చోటు లేదు. ఆ అపారప్రజ్ఞకు అందరాని విషయము లేదు.

అని పలికి రాజుగారు ఆసనమునుండి లేచి బుద్ధభగవానుడున్న చోటునకు వెళ్ళి, చేతులు జోడించి, భక్తితో మ్రొక్కి, తప్పుటడుగులు వేయుచు, దేవా ! నీవు సమ్యక్సంబుద్ధుడవు, నమస్కారము అని ముమ్మారు పలికి, నేనుకూడ తమశిష్యకోటి లోనివాడ నని నిశ్చయించుకొనుమని చెప్పుకొనెను.

(5) తులసీదాసు మిక్కిలి కాముకుడు. ఆయన ఒకనాడు రాజుగారివెంట అడవికి వెళ్ళెను. ఇంతలో అత్తగారికి జబ్బు చేసినదని ఒక మనిషి వచ్చి చెప్పి భార్యను పుట్టింటికి తీసికొని వెళ్లెను. తులసీదాసు సాయంత్రమునకు ఇంటికి వచ్చి చూడగా భార్య కనుపించనందున తన తల్లిని అడిగి భార్య పుట్టింటికి వెళ్ళిన విషయమును తెలిసికొని సరిగా భోజనముకూడ చేయక అత్త వారింటికి బయలుదేరి అర్ధరాత్రివేళకు భార్యదగ్గరకు వెళ్ళి నీపైగల మోహమును నిగ్రహించలేక ఈ యర్ధరాత్రివేళ నీ దగ్గరకు రావడమైనదని చెప్పగా అపుడు భార్య యిట్లు చెప్పెను.

" అస్తి చర్మమయ దేహా మమతామే ఐసే ప్రీతి ।
తైసీ జో శ్రీరామమహాహోతి న తౌ భవభీతి ॥ "

తా॥ నాథా ! ఎముకలు, మాంసము, రక్తము, మల మూత్రాదులతో కూడియున్న నా యీ శరీరముపై ఇంత ప్రీతి

నుంచెదరేల ! ఈ ప్రీతిని త్రిభువనమోహనుడైన ఆ శ్రీరామ చంద్రునిపై నుంచినయెడల సంసారభీతి ( జనన మరణ భీతి ) నశించిపోవును. అని చెప్పగనే తులసీదాసుగారి మనసు గిఱ్ఱున శ్రీరామప్రభువువైపునకు తిరిగినది. వెంటనే అచట నుండి కాశీక్షేత్రమునకు వెడలిపోయి శ్రీరామధ్యానము చేసి శ్రీరామదర్శనము నొంది గొప్ప మహాత్ము డయ్యెను.

(6) రామాబాయి భర్త చెడువర్తన గలవాడు. ఆయన చెడువర్తనమును మాన్పించి మంచిప్రవర్తన గలవానినిగా రామాబాయి మార్పుచేయించ దలచి ఒక ఏకాదశిరోజున ఉపవాసవ్రతముతో నుండెను. ఆనాడే తన భర్త ఒక మేకను తెప్పించి కోయించి వంటవానిని కూర వండమని చెప్పెను. ఇంతలో రామాబాయి తన కుమారునకు విషముపెట్టి చంపెను. అపుడు తన భర్త మితిలేని దుఃఖములో మునిగి విలపించు చుండెను. అపుడు మెల్లగా రామాబాయి భర్తదగ్గరకు వచ్చి ఎందుకు మీ రేడ్చెదరు ! చచ్చినవాడు మరల బ్రతుకునా యని చెప్పినను అదేపనిగా దుఃఖపడుచునే యుండెను. కొంతసేపైన తరువాత రామాబాయి భర్తతో దేవాలయమునకుపోయి భక్తుల దగ్గర శ్రీహరి ప్రసాదములను తీసికొనివచ్చి చచ్చియున్న పిల్లవాని నోటిలో వేయుము బ్రతుకునేమో యని చెప్పెను. భార్య మాటయందు నమ్మకము లేకపోయినను చేసి చూత మనుకొని దేవాలయమునకు వెళ్లి భక్తుల నడిగి తీర్థప్రసాదములను తీసి కొనివచ్చి చచ్చియున్న పిల్లవాని నోటిలో వేయగానే నిద్రనుండి లేచినవానిలాగా బ్రతికి లేచెను. అపుడు భగవద్భక్తుల మహిమ విశేషములను భర్త గుర్తించి చెడువర్తనములను వదలి పరమ భక్తుడయ్యెను.

(7) సక్కుబాయి యొక్క శ్రీ పాండురంగ భక్తి ప్రభావముచేతనే ఆమె భర్త, అత్తయును భక్తులైరిగదా.

(8) నాస్తిక భావముతో కాముకుడై యున్న లీలాశుకుడు చింతామణి యొక్క హితోపదేశములను విని భగవంతుని భజించి పరమభాగవతోత్తముడై గ్రంథకర్తకూడ నయ్యెనుగదా.

ఈ విధముగా భర్తలకు జ్ఞానవైరాగ్యాది ధర్మ బోధలను చేసి పరమపవిత్రులనుగా తయారుచేసిన (మార్చివేసిన) మహాతల్లుల చరిత్రలు అనేకములు కలవు.

ఆ. తనదు బాగు గోరి ధర్మంబు చెప్పిన
దిట్టుచుండు నధము డెట్టయెదుట
గడ్డివేయ పోట్లగొడ్డు కొమ్మాడించు
విశ్వదాభిరామ వినుర వేమ.

ఆ. సాటివారు నిన్ను సాధింపగాలేరు
ధర్మ మెపుడు నీవు తప్పకున్న
భారతంబులోని పరమార్థ మిదెగదా
విశ్వదాభిరామ వినుర వేమ.

భర్త మంచివాడుకాదని భార్య చింతపడ నవసరములేదు. ఇట్లే భార్య మంచిదికాదని భర్త చింతించనవసరములేదు. ఎవరికి వారే ధర్మవర్తనులై యున్నయెడల జీవితము విజయ మొందును.

## స్త్రీ యెవరు ? పురుషు డెవరు ?

శ్లో॥ మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహం।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత !॥

తా॥ ఓ యర్జునా ! నా యొక్క గర్భము నుంచుటకు మహత్తైన బ్రహ్మము అనగా త్రిగుణాకారమైన నా యొక్క ప్రకృతియే స్థాన మగును. దానిలో నేను నాగర్భము నుంచు చున్నాను. అన్ని ప్రాణులున్ను దానివలననే పుట్టుచున్నవి. సాధారణముగా లోకములో అనేకమంది స్త్రీలు మేము అబలుల మని దీనభావమును వహించుచున్నారు.

పురుషులు స్త్రీలకంటె మేమే ఎక్కువవారమని గర్వ పడుచున్నారు. నిజముగా లోకములో స్త్రీ యెవరో ? పురుషు డెవరో ? విచారించి తెలిసికొనక పోవుటవలననే స్త్రీలకు దీన భావమును, పురుషులకు గర్వమును పుట్టుచున్నది. స్త్రీ శరీర ములో స్త్రీ పురుషు లున్నారు. ఇట్లే పురుషుని శరీరములో కూడ స్త్రీ పురుషు లున్నారు. మొదట వ్రాసిన గీతాశ్లోకము ప్రకారము సత్త్వ రజ స్తమోగుణముల రూపమగు ప్రకృతియే స్త్రీ యనబడును. ఈ ప్రకృతికి ఆధారముగా సాక్షిగా నున్న పరబ్రహ్మమే పురుషు డనబడును. ఈ ప్రకృతి పరబ్రహ్మము రెండును స్త్రీపురుషుల శరీరములందు సమానముగానే యున్నవి గదా. స్త్రీని పురుషుడుగాని, పురుషుడు స్త్రీనిగాని మోహిం చుట యనగా, ప్రకృతి ప్రకృతినే మోహించుట యగును.

ప్రకృతిగుణములకు లోబడి ప్రవర్తించువారు పురుషు లైనను స్త్రీలే యనవలెను. ప్రకృతిగుణములను (మనస్సును)

జయించి పరబ్రహ్మానుభవదృష్టితో నున్నవారు స్త్రీలైనను పురుషులే యనబడుదురు. ప్రకృతి (స్త్రీ) వలననే సమస్త చరాచరప్రపంచమును కనబడుచున్నది (పుట్టినది). ఈ ప్రపంచమును పరబ్రహ్మముగా (పురుషునిగా) అభేదదృష్టితో కాంచుటయే పరమార్థజ్ఞాన మనబడును. మనదృష్టికి స్త్రీ పురుష భేదములు, మట్టి బంగార మను భేదములు, స్తుతినిందా సుఖదుఃఖాది భేదములు కనబడుచున్నంతవరకును మనలోగల స్త్రీని (ప్రకృతిని) మనము స్వాధీనములో నుంచుకొనక (జయించలేక) ఆమెకు (ఆ మాయామనస్సునకు) దాసులమై యున్నామనియే నిశ్చయించుకొనవలెను.

స్త్రీ (ప్రకృతి) యెట్లు స్వాధీనమగు ననగా :

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే॥

అర్జునా! దైవసంబంధమైనదియు, మూడుగుణముల మయమైనదియు నగు నా మాయను (స్త్రీని) జయించుట చాలకష్టము. ఎవను యే స్త్రీపురుషులు పరబ్రహ్మస్వరూపుడనైన నన్ను ఇతర చింతలు (కోరికలు) లేక భజించుచున్నారో ఆ స్త్రీ పురుష శరీర ధారులు మాయను స్వాధీనపరచుకొని మోక్షసుఖము నొందుచున్నారు.

తే. ప్రేమమీరంగ శ్రీరామ రామ రామ
యనుచు సతతంబు మత్స్వరూపానుభవము
జేయువారలదక్క నీ సీత మిగుల
వెట్టివారల జిక్కులబెట్టు ననఘ॥(సీతారామాంజనేయం)

మోక్షసుఖము స్వస్వరూపపరబ్రహ్మజ్ఞానము స్త్రీపురుషు లిరువురచేతను కోరబడుచున్నది. కాన ఎల్లప్పుడున్ను శాశ్వత స్వరూపమైన ఆత్మారాముని భజించనిచో సీత యనబడు అజ్ఞాన మాయ అనేకచిక్కులలో ముంచి దుఃఖపెట్టునని గ్రహించవలెను. స్త్రీ వ్యామోహమును త్యజించవలెనను ధర్మవాక్యము స్త్రీపురుష శరీరధారు లిరువురకును చెప్పబడినదని తెలియవలెను. గుహ్యేంద్రియచాపల్యమే స్త్రీవ్యామోహమని చెప్పవలెను. స్త్రీలను పురుషులు దూషించక, ఇట్లే పురుషులను స్త్రీలును దూషించక గుహ్యేంద్రియచాపల్యము కలవారు దూరముగా నుండి బ్రహ్మ జ్ఞాన సాధనలను చేయుచుండవలెను.

కేవలము కఠినస్వభావమైన పురుషలక్షణము కలవారికి మోక్షమార్గమందు ప్రవేశములేదనియు, కేవలము మెత్తనిస్వభావ మైన స్త్రీలక్షణము కలవారికిని మోక్షమార్గమందు ప్రవేశము లేదనియును శాస్త్రము చెప్పెను. లోకములో ఎక్కువగా గౌర వింపబడునవి సత్ప్రవర్తనలు, సద్గుణములు నగునేకాని స్త్రీ పురుషుల ఆకారములుకావు. అందువలన సత్ప్రవర్తనలు, సద్గుణ ములున్న కలవారే స్త్రీలలోగాని పురుషులలోగాని శ్రేష్ఠులన బడుదురని గ్రహించవలెను.

శ్లో॥ వర మగ్నౌ స్థితి ర్హింస జంతూనాం సన్నిధౌ సుఖం।
తతోపి దుఃఖదం పుంసాం దుష్టస్త్రీ సన్నిధౌ ధ్రువమ్॥

తా॥ అగ్నిదగ్గరను, బాధలుకలిగించెడి జంతువుల సమీపము నందును నివసించుట సుఖముగానుండును గాని, దుష్టస్త్రీసన్నిధిని వసించుటమాత్రము మిక్కిలి దుఃఖప్రదమగును.

శ్లో॥ యే కామినీం గుణవతీం చ యౌవనాం చ
నారీం నరాః ప్రణయినీం చ విమానయంతి
తేభ్యో కృషీవలవచఃపరిదగ్ధచిత్తైః
గోభి స్సమం పృథుముఖేషు హలేషు యోజ్యాః ॥

తా॥ గుణవంతురాలగు భార్యను అవమాన పరచిన పురుషుని దుక్కిటెద్దుప్రక్క నాగలికి గట్టి దున్నమని బుద్ధిమంతులు చెప్పిరి.

---

## ఎట్లు జీవించవలయును ?
## ఎట్లు మరణించవలయును ?
### (దివ్యజీవనము — దివ్యమరణము)

శ్లో॥ యజ్ఞదాన తపః కర్మ నత్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖంవా యదివా దుఃఖం స యోగీ పరమో మతః ॥

మానవులు భగవంతునకు, మహాత్ములకు, మానవాది ప్రాణులకును ప్రియమైన, క్షేమకరమైన యజ్ఞము, దానము, తపస్సును తప్పక చేయుచుండవలెను. తమ ప్రాణముతో సమముగా ఇతర ప్రాణులను చూచుచుండవలెను. ఇట్లు చేసిన మాత్రమే దైవానుగ్రహము కలిగి హృదయము దుఃఖరహితమై పరమానందము ప్రాప్తించును. యిదే దివ్యమైన మధుర జీవిత తత్త్వము.

శ్లో॥ అంతకాలే చ మామేవ స్మర న్ముక్త్వా కళేబరం
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

శ్లో॥ ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిం॥

మరణ సమయమున పరమాత్మయందు దృష్టినుంచుకొని భగవన్నామమును స్మరించుచు దేహమును వదలినవారు నిస్సం దేహముగా పరమపదమును పొందుదురు.

అంత్యకాలమునందు శివ రామ కృష్ణ నారాయణాది మంత్రములను స్మరించుట ప్రయాసముగా నుండవచ్చును. కనుక "ఓమ్" యను మంత్రమును ప్రాణవాయువుతో చేర్చి స్మరించుట సులభముగా నుండును. ఇది మరణకాల ధర్మము.

బ్రతుకు అహింసావ్రతముతో, పరోపకారబుద్ధితో, భక్తి జ్ఞాన వైరాగ్యములతో యున్నమాత్రమే మరణఫలము మోక్ష సుఖము కాగలదు.

శ్లో॥ ధి గజ్ఞానం ధి గజ్ఞానం ధి క్కామక్రోధ సంకటమ్ ।
సంసారశృంఖలం ధి గ్ధి గాచార్యాద్ జ్ఞాన మాప్నుయామ్॥

శ్లో॥ గర్భస్మృతేరభావేన శాస్త్రముక్తం మహర్షిభిః ।
తద్దుఃఖకథనార్థాయ స్వర్గమోక్ష ప్రసాదకమ్॥

తల్లిగర్భములో మనమున్నపుడు మనకు మోక్షధర్మజ్ఞాన ముండును. అందువలన మనము తల్లిగర్భములో నున్నప్పుడే అజ్ఞానమును నశింపజేసికొనవలయునని, దుఃఖములను కలిగించునట్టి కామక్రోధాది గుణములను నాశనము చేయవలెననియు, సంసార మను గొలుసును త్రెంచివేయవలెననియు, సద్గురువు నాశ్ర

యించి జ్ఞానము నొందవలెననియును పరితాపముతో నిశ్చయించు కొని యుందుము. కాని తల్లిగర్భమునుండి భూమిపై పడగానే వివేకజ్ఞానశూన్యుల మగుచుందుము.

గర్భములోనున్న వివేకజ్ఞానము పుట్టినతరువాత మరపునకు వచ్చుటచేతనే అజ్ఞాన (సంసార) దుఃఖ నివృత్తికొరకు శాస్త్రములచేతను మహాత్ములచేతను స్వర్గ మోక్ష సుఖముల నొందే సాధనధర్మములు చెప్పబడినవి.

బాల్యమునుండియును శాస్త్రములు పెద్దలున్ను చెప్పినట్లుగా ఆశ్రమధర్మములను తప్పకయున్న యెడల అంత్యకాలమున దివ్యమైన స్మృతి యుండును. దివ్యస్మృతియే దివ్యపదము నొందించును. భగవంతుని ఒక భక్తు డిట్లు వేడుకొనెను. అదేమన :

శ్లో॥ అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనం ।
దేహాంతే తవ సాయుజ్యం దేహి మే పార్వతీపతే ॥

తా॥ ఓ పార్వతీశా ! దరిద్రబాధలేని బ్రతుకును, ఆయాసమునొందని మరణమును, దేహత్యాగానంతరము నీలో ఐక్యమయ్యే మహాభాగ్యమున్ను నాకు దయచేయుము.

మరణధర్మమును పడుచువారికంటె ముఖ్యముగా ముసలివారు గుర్తులో నుంచుకొన దగినదై యున్నది. ముసలివారికికూడ ధనముపైని, కీర్తిపైని, వ్యర్థసంభాషణలపైని ప్రీతి యుండుట చూచుచునే యున్నాముగదా !

"ముదిసెను దంతావళియును
ముదిసెను కేశములు తనువు ముదిసెం దనకున్

ముదియనివి రెండు దక్కేను
బ్రతికెడి తీపియును విషయపతుస్పృహాయున్. "

దంతములు, కేశములు, శరీరమును జీర్ణావస్థకు వచ్చినను బ్రతుకుపై తీపియు, ధనాది విషయములపై మమకారములున్ను బలిష్ఠముగానే యున్నవి.

శ్లో॥ యథా వ్యాళగళస్థోపి భేకో దంశా నపేక్షతే ।
తథా కాలాహినా గ్రస్తో లోకో భోగా నశాశ్వతాన్ ॥

తా॥ సర్పము కప్పను మ్రింగుచుండగా కప్ప తనదగ్గరకు వచ్చిన ఈగలను మ్రింగుటకు అపేక్షించునట్లు మానవులు కాల సర్పముచే మ్రింగబడుచును అశాశ్వతభోగములను కోరుచునే యున్నారు.

శ్లో॥ విజ్ఞాయ చరమావస్థాం దేవతాభ్యో నృపోత్తమః
ఖట్వాంగో నామ రాజర్షిః ముహూర్తే ముక్తిమేయివాన్ ॥

ఖట్వాంగుడు యను రాజర్షి తనకు మరణకాలము ఆసన్నమైనదని దేవతలవలన తెలిసికొని దేహధనాదులపై గల మమకారమును త్యజించి పరమాత్మ భావనాస్థితియం దున్న వాడై రెండు గడియలలోనే మోక్షపదము నొందెను.

లోకములో కొందరు మరణభయముచే సత్యధర్మములను, భక్తివైరాగ్యములను తప్పి నడచుచున్నారు. విశ్వామిత్రుడు మరణభయముచేతనే చండాలుని గృహమందు కుక్క మాంసమును దొంగిలించి తినెనుగదా. సాధు సన్న్యాసులలో ననేకులు కష్టములకు మరణ భీతికిని చలించి భగవంతునిపై జీవిత భారము నంతను పెట్టలేక భౌతికసుఖములకు లోబడుచున్నారు.

లోకములో మరికొందరు చిరకాలము జీవింతు మను భ్రాంతిచేత సత్యమార్గమును, ధర్మమార్గమును వదలి ధనాది వస్తువులను, బంధుమిత్రాదులపై మమకారమును వదలలేక కట్టు బడి యున్నారు.

శ్లో॥ న కాలే మ్రియతే జంతు ర్విద్ధ శ్శరశతై రపి।
కుశాగ్రేణైవ సంస్పృష్టః ప్రాప్తకాలో న జీవతి ॥

తా॥ నూరు బాణములచే కొట్టినను కాలము మూడని వాడు చావడు. కాలము వచ్చినవాడు దర్భ గుచ్చుకొనినను చచ్చును.

" ధనాశా జీవితాశా చ గుర్వీ ప్రాణభృతాం సదా "

ప్రాణులకు జీవితముపైని, ధనము ( తిండి ) పైని విశేష ముగా ప్రీతియుండును.

చ. ఏను మృతుండ నౌదునని యింతభయంబు మనంబులోపలన్
మానుము సంభవంబుగల మానవ కోటికి చావు నిత్యమౌ
గాన హరిం దలంపు మిక గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ ! పొందెదవు మాధవలోకనివాససౌఖ్యముల్.

పుట్టినవాటికి చావు తప్పదు. పుట్టినవాటిపై అస్థిరబుద్ధి లేకపోవుటచేతనే మానవులకు దుఃఖములు కలుగుచున్నవి. పరమాత్మను సుస్థిరభక్తితో నమ్మి ధ్యానించుచున్నమాత్రమే అస్థిరవస్తువులపై గల వ్యామోహములు నశించుచుండును. తెలిసినవిషయములపై (జ్ఞానధర్మములపై ) నమ్మకము నుండ నీయక చేయునదే మాయ యనబడును.

దైవరుచి దొరకనంతవరకును ఇంద్రియవిషయములపై గల రాగద్వేషములు నశించవు.

మృత్యువును, దేవుని గుర్తులో నుంచుకొనినవారికి జ్ఞానము కల్గునని ఒక మహాత్ముడు చెప్పెను.

సంసారవిషయములతో రాత్రింబవళ్లును అశాంతి నొందు చున్న ఒక ధనవంతుడు ఒక సాధువుదగ్గరకు వచ్చి తన బాధ లన్నిటిని చెప్పుకొనెను. అపుడా సత్పురుషుడు ధనవంతునితో 'నీవు ముప్పది దినములకు చనిపోవుదువు పొమ్ము'యని చెప్పగా వెళ్లి ఇట్లు నిశ్చయించుకొనెను. నేను ముప్పది రోజులకు మరణింతునుగదా నాకిక ఈ సంసారవిషయములతో సంబంధ మేల అనుకొని నిశ్చింతగా హాయిగా ఆనందముతో కాలము గడపుచు నా జీవితములో ఇదివరకెన్నడును ఇట్టి ఆనందము లభించలేదుగదా యనుకొనెను. ధనవంతుని అశాంతి నశించుట కొరకే ఆ సత్పురుషుడు ముప్పది దినములకు మరణింతువని చెప్పెనేగాని అది నిజముకాదు. దేహముపైని, సంసారముపైని గల మమకారమును మరణస్మృతి నశింపజేయుటచేత ఆ ధన వంతుడు ఆత్మసుఖము నొందెను.

దేవేంద్రనాథ ఠాకూరు తన తల్లి మరణమును చూచి అగాధవిచారణలో దిగి ప్రపంచముపై విరక్తియు, పరమాత్మపై రక్తియు గలవాడయ్యెను.

చిత్తూరు జిల్లాలో ఒక భక్తుడు అంత్యకాలములో తన భార్యను పిలచి నన్ను గోడకు ఆనించి కూర్చొనబెట్టి నా చేతికి జపమాల నిమ్మని చెప్పగా ఆమె అట్లేచేయగా కొంతసేపు

జపము చేసి దైవస్మరణతోనే ప్రాణమును విడిచెను. ఇది చక్కని మరణమేగదా.

మారీచుడు శివభక్తుడు. అందువలన మాయబంగారపు లేడి రూపమును పొందియున్న మారీచుని శ్రీరాముడు బాణముతో కొట్టగా శివశివా యని స్మరణచేయుచు ప్రాణమును వదలి శివ లింగ మయ్యెను. ఇప్పటికిని ఆ శివలింగము పూజింపబడు చున్నది. ఈ కథవలన భగవద్భక్తితో జీవితమును గడుపు చున్నవారికి మరణకాలమున మంచిగతి లభించునని తెలియు చున్నదిగదా.

అంత్యకాలములో ధనమును స్మరించుచుగాని, బిడ్డలను స్మరించుచుగాని, స్నేహితులను, బంధువులను, సోదరులను, భార్యను స్మరించుచుగాని ప్రాణమును వదలినచో స్మరించిన నామరూపములకు తగినజన్మ వచ్చును. కాన యిప్పటినుండియే సర్వకాల సర్వావస్థల యందును భగవంతుని స్మరించుట, ధ్యానించుట మన పరమకర్తవ్యమని నిశ్చయించుకొని ప్రవర్తించ వలెను.

నామదేవుడు కొంతవరకు రామాయణమును వ్రాసి చని పోయినాడట. తరువాత మరల తుకారాముగా పుట్టి ఆ రామా యణమును పూర్తిచేసినాడట.

1955 వ సంవత్సరమములో కాశీకి ఒక ముసలమ్మ వెళ్లి అచ్చటనున్న దేవుళ్లను, పెద్దలను, సాధువులను, భక్తులను కన్నుల పండుగ యగునట్లు చూచి విశ్వేశ్వరుని స్మరించుచు దాన ధర్మ ములును జేసి గంగానదియొడ్డున ఆసనము వేసికొని కూర్చొని

జపధ్యానములను చేసి మెల్లగాలేచి గంగానదిలోదిగి విశ్వేశ్వరుని తలంచుకొనుచునే గంగామాతకు తనశరీరమును సమర్పించెను. ఇది యొక పుణ్యమరణమేగదా.

---

## పుణ్యప్రభావము

శ్లో॥ యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణాం ।
తే ద్వంద్వమోహానిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽత్మశుద్ధయే ॥

తా॥ పుణ్యకర్మలజేసి ఏమానవులు పాపములను పోగొట్టు కొనిరో ఆ మానవులు మాత్రమే సుఖదుఃఖ, స్తుతినింద, రాగద్వేష, ఆకలి దప్పిక, స్త్రీ పురుష, లాభనష్టము లనెడి భేదములనుండి విడుదలనొంది నిశ్చలభక్తితో పరమాత్మను భజించుచుందురు, భజించగల్గుదురు. కనుక మనోవాక్కాయములతోను ఇంద్రియ ములతోను పుణ్యకర్మలను నిష్కామభావముతో చేయుచుండ వలెను. సత్కర్మల జేయుటచే హృదయము పరిశుద్ధమగును. పుణ్యములేనివారు మనోవాక్కాయములతో చేయబడుచున్న పాపకర్మలను వదలిపెట్టలేరు.

పుణ్యము లేనిచో ధర్మాధర్మములేవో, నిత్యానిత్యములేవో ఆత్మానాత్మలెవ్వో తెలియబడవు.

పుణ్యము లేనిచో శరీరముతో దీనులకుగాని, దేవునకు గాని, పెద్దలకుగాని సేవ చేయలేరు. వాక్కుతో సత్యముగా,

హితముగా మితముగా, మాట్లాడలేరు. భగవంతుని, మహాత్ము లను స్తుతించను నాలుక యిష్టపడదు. మనస్సుతో జపము, బుద్ధితో ధ్యానమును చేయజాలరు.

పుణ్యము లేనిచో సజ్జనులతో స్నేహము చేయలేరు. సద్గ్రంథములను చదువ నిచ్చపుట్టదు. పుణ్యస్థలములకు పోలేరు.

పుణ్యము లేనిచో చదివిన, శ్రవణముచేసిన, చూడబడిన సద్ధర్మములను గుర్తులో నుంచుకొనలేరు.

పుణ్యము లేనిచో కామ క్రోధ లోభ మోహ మద మాత్స ర్యాది దుర్గుణములను నశింపజేసికొనజాలరు.

పుణ్యము లేనిచో మనోవాక్కాయనములతో చేయబడు పనులలో నిష్కపట భావము నుంచుకొనజాలరు.

పుణ్యము లేనిచో శరీరము అనిత్యమైనదని, పరమాత్మయే నిత్యమని, వైరాగ్యమే మహాసౌఖ్యప్రదమైనదనియు సుస్థిర ముగా నమ్మజాలరు.

పుణ్యము లేకపోవుటవలననే వేదాంతులలో, గురు బిడ్డలలో, సాధువులలో, సన్న్యాసులలో ననేకులు భక్తి జ్ఞాన వైరా గ్యములతో నుండజాలక ఇంద్రియ విషయసుఖములకు లోబడు చున్నారు.

" జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః "

తా॥ పుణ్యకర్మలద్వారా పాపదోషములు నశించినపుడే మానవులకు జ్ఞానము కలుగును.

శ్లో॥ సర్వపాపేషు నష్టేషు బుద్ధి ర్భవతి నిర్మలా
సైవ బుద్ధి స్సమాఖ్యాతా జ్ఞానశబ్దేన సూరిభిః॥

తా॥ సమస్త పాపదోషములున్ను నశించినపుడు బుద్ధి

కామక్రోధాది గుణదోషములు లేనిదై పరిశుద్ధముగా నుండును. పరిశుద్ధహృదయమునకే పరమాత్మజ్ఞానానుభవము కలుగును. ఇదే ముక్తి.

పుణ్యాత్ములు ఒక్కపర్యాయము చూచినను, శ్రవణము చేసినను విశేషజ్ఞానవంతులు కాగలుగుదురు. పాపాత్ములు ఎంతకాలము చూచినను శ్రవణముచేసినను ప్రపంచముపై దేహముపై విరక్తియు, భగవంతునిపై, సద్గురువులపై భక్తియు కలుగవు.

పుణ్యము పరమాత్మవైపునకు లాగును. పాపము ప్రపంచ సుఖములవైపునకు లాగును.

## కర్మలు - కళలు

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌన్తేయ ! తత్కురుష్వ మదర్పణమ్ ॥

తా॥ అర్జునా ! (కైవల్య సుఖము నొందగోరిన ఓ భక్తుడా) నీ వేమి చేయుచున్నావో ఏమి తినుచున్నావో ఏ హోమము చేయుచున్నావో దేనిని దానము చేయుచున్నావో ఏ తపస్సు చేయుచున్నావో వాని నన్నిటిని నాకు సమర్పించుము.

పరమాత్మకు సమర్పించబడిన కర్మలు శాశ్వత సుఖము నిచ్చును. దేహమునకు (లోకమునకు) అర్పించబడిన కర్మలు క్షణికసుఖమును గలిగించి తరువాత బంధములో ముంచును.

పరమాత్మ ప్రీత్యర్థముగా చేయబడిన కర్మలు కళావంతమై శోభించును. దేహప్రీత్యర్థముగా చేయబడిన కర్మలు కళంకిత ములై బుద్ధిమంతులచే దూషింపబడుచుండును.

కళలేని కర్మ వెలిగించని లాంతరువంటిది. కళతో (నిష్కామముతో) కూడిన కర్మ వెలుగుచున్న లాంతరువంటిది.

వెలుగుచున్న లాంతరుదగ్గర గల వస్తువులన్నియు కనబడును. వెలుగని లాంతరుదగ్గర వస్తువు లున్నను కానుపించవు గదా. ఇట్లే పరమాత్మభావనతో నిష్కాములై యున్నవారికి కనబడుచున్న సృష్టిరహస్యము లన్నియు తెలియును. దేహాభి మానులై కామ క్రోధాది గుణములతో నున్నవారికి సృష్టి రహస్యములు తెలియకపోవుటయేగాక అనేక బాధలు కలుగు చుండును.

పూజచేయుట కర్మయగును. ఆ పూజను నిష్కామ భావముతో భగవంతునిపై దృష్టినుంచి భక్తితో చేయుట కళయగును.

సేవచేయుట కర్మ. దీనిని వినయవిధేయతలతో నిష్కామ ముగా చేయుట కళ యనబడును.

దానము చేయుట కర్మ, ప్రేమతో ఫలాపేక్షలేకుండా చేయుట కళ.

భగవన్నామసంకీర్తన (భజన) చేయుట కర్మ. పర మాత్మయందు భక్తితో మనస్సును సంలగ్నపరచుట కళ.

కూర్చొనుట కర్మ. ఆసనము వేసికొని చూచువారికికూడ యింపుగా నుండునట్లు నిశ్చలముగా కూర్చొనుట కళ.

భోజనము చేయుట కర్మ. మౌనముతో నిశ్చలముగా దైవచింతనతోను భుజించుచుండుట కళ.

పాండిత్యమును సంపాదించుకొనుట కర్మ. పరోపకార మొనర్చుట కళ.

గృహస్థుడగుట కర్మ. న్యాయార్జనతో దానధర్మములు గలిగియుండుట కళ.

సన్న్యాసాశ్రమమును స్వీకరించుట (కాషాయ వస్త్రమును ధరించుట) కర్మ. ఆశారహితుడై, క్రోధరహితుడై సమత్వదృష్టితో పరమాత్మధ్యానమును విడువకుండుట కళ.

తపస్సు చేయుట కర్మ. విశ్వామిత్రునివలె ఫలాపేక్షతో చేయక మనోనిగ్రహము సిద్ధించి పరమాత్మజ్ఞానము కలుగుట కొరకు చేయుట కళ.

మాట్లాడుట కర్మ. సత్యముగా, ప్రియముగా, హితము కలుగునట్లుగా, మితముగా మాట్లాడుట కళ.

ఉపన్యాసములిచ్చుట కర్మ. దీనిని ధనసంపాదన, గౌరవ సంపాదన, శిష్యసంపాదనలపైని ప్రీతినుంచక శ్రోతలు పవిత్రులు, భక్తులు, జ్ఞానులున్ను యగుదురుగాక యను భావముతో బోధించుట కళ.

సత్సంగము, సత్కర్మలను చేయుట స్థూలశరీర కళలు. సద్గుణములు కలిగియుండుట సూక్ష్మశరీర (మానసిక) కళలు. సర్వత్ర పరబ్రహ్మమునే గాంచుచుండుట కారణశరీరమునకు సత్కళ యగును.

కళలులేని జీవితము తనకున్ను, ఇతరులకున్ను బాధామయముగానే తోచును.

## నరుడు నారాయణు డెపు డగును ?

హృదయములో రాగముగాని, ద్వేషముగాని యున్నంత వరకును నరుడు నారాయణుడు కాజాలడు.

వినే శబ్దములలో ఇష్టానిష్టములు, కనబడే రూపములలో ప్రియాప్రియములు, తినబడే పదార్థములలో రుచి యరుచులు, స్పర్శలలో మృదు కఠిన శీతోష్ణములు, నాసికచే మంచి చెడు వాసనలున్ను కనబడుచున్నంతవరకును నరుడు నారాయణుడు కాజాలడు.

రాగద్వేషములు, సుఖదుఃఖములున్ను మనస్సులో గల దోషములు. మనస్సునకు సాక్షిగా యున్న పరమాత్మ నిరంతరమును నిర్వికారముగా, ఆనందమయముగానే యున్నది. మనస్సును నిగ్రహించుము. నారాయణ స్వరూపము నీవే యని అనుభవపూర్వకముగా నిశ్చయించుకొన గలుగుదువు.

శ్లో॥ వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ
తాసు తేష్వప్యనాసక్తో హి నరో నారాయణో భవేత్ ॥

తా॥ మానవులకు కామ సుఖమునందు భ్రాంతి, ధనము నందు భ్రాంతి యను రెండు భ్రాంతులు కలవు. ఈ రెండు భ్రమలున్ను నశించిన పురుషులు నారాయణస్వరూపు లగుదురు. స్త్రీలు నారాయణీ ( లక్ష్మీ ) స్వరూపు లగుదురు.

శ్లో॥ శిశ్నస్య నిగ్రహః పుత్రా, జిహ్వాయా అపి నిత్యశః ।
ద్వయం యద్ధి భవే ద్యస్య స ఏవ స్యా జ్జనార్దనః ॥

తా॥ పుత్రా, ఎల్లపుడును గుహ్యేంద్రియమును,

జిహ్వేంద్రియమును ఎవడు నిగ్రహించునో వాడు విష్ణువే యగును అని నారదుడు ఋషులకు చెప్పెను.

శ్లో॥ హృదయా త్సంపరిత్యజ్య సర్వమేవ మహామతే ।
యస్తిష్ఠతి గతవ్యగ్ర స్స ముక్తః పరమేశ్వరః ॥

తా॥ ఎవరు మనస్సులోగల సకలవిషయములను తొలగించుకొని, దుఃఖరహితులై నిర్విచారముగా ఆనందముగా నుందురో వారే ముక్తులు. వారే పరమేశ్వర స్వరూపులును.

నిష్కామము (నిరాశ), సమత్వదృష్టి యనెడు ఈ రెండు గుర్తులచే జ్ఞానము గలదని గుర్తించవలెను. కోరికలు (ఆశలు), భేదభావములును గలవారే అజ్ఞానులని తెలిసికొనవలెను.

---

## వైరాగ్యమనగా నేమి ?

రాగములేకుండుట వైరాగ్యము. రాగమనగా అనిత్యములైన, బంధహేతువులైన పాపదోషములతో కూడిన నామరూప క్రియలయందు గల ఆసక్తియే.

నిత్యమైన పరమాత్మయందు, దేవునియందు, సద్గురువునందు, సద్గ్రంథములలోని భక్తి జ్ఞాన వైరాగ్యాది ధర్మములయందును ఎంత భక్తి విశ్వాసములు నీవు కలిగియుందువో అంత వైరాగ్యము నీకు సహజముగా నీలకడ కలిగియుండును.

భగవంతునియందు గల భక్తిచే దైవరసమును నీవు గ్రోలుచున్నపుడే ప్రపంచవిషయభోగములున్ను నీకు విషముగా గోచరించును.

వెలుతురుదగ్గరకు చీకటియు, చీకటిలో వెలుతురును లేనట్లు దైవాత్మరుచిలో నీవు నిలకడ కలిగియున్నచో ఇంద్రియ విషయసుఖములు నీకు గోచరించవు. ఇంద్రియసుఖములలో నీవు మునిగియున్నచో దైవాత్మసుఖము అస్తమించును (కనపడదు).

నీవు నిజముగా నిత్యానిత్య ఆత్మానాత్మ ధర్మాధర్మ కర్తవ్యాకర్తవ్య వివేకముతోను, ఆత్మానందముతోను యున్నచో అజ్ఞానగుణములను వృద్ధిజేయు విషయములు నీ కంటికి కనబడినను నీ మనస్సు చూడదు. నీ చెవులు వినుచున్నను నీ మనస్సు వినదు. నీ నాలుక తినుచున్నను నీ మనస్సు తినదు. నీ ముక్కు వాసనచూచినను నీ మనస్సు చూడదు. నీ చర్మము తాకినను నీ మనస్సు అంటదు. నీ కాళ్ళు నడచుచున్నను నీ మనస్సులో నడచుచున్నాను అను భావముండదు. నీ చేతులు పనులుచేయున్నను నీ మనస్సు చేయుచున్నాననుకొనదు. నీ వాక్కు మాట్లాడుచున్నను నీ మనస్సు మాట్లాడుచున్నా నను కొనదు.

అహం మమతలు లేనప్పుడే నిజమైన వైరాగ్యమున్నట్లగును.

ఒక్కమాటలో చెప్పవలయునంటే, నామరూపక్రియారూపమైన ప్రపంచము (సంసారము లేక దేహము) నీ దృష్టిలో లేకుండుటయు, సర్వపరిపూర్ణపరమాత్మ నీదృష్టియందుండుటయును నిజమైనవైరాగ్యము, జ్ఞానము, పరమభక్తియు నగునని దృఢనిశ్చయము కలిగియుండవలెను.

"నవైరాగ్యాత్పరోలాభః" వైరాగ్యముకంటె శ్రేష్ఠమైన లాభమైనది లేదు. "వైరాగ్యమేవాఽభయమ్" వైరాగ్యమే భయములేనిది.

## వైరాగ్య పంచకము

(1) మర్కట వైరాగ్యము—అనగా వైరాగ్యము లేకుండ యుండియు విరక్తునివలె మాటలు చెప్పుచు, వేషములతో నుండుట.

(2) కపట వైరాగ్యము—అనగా భోజనాది సౌకర్యములకొరకు సాధువులతో, భక్తులతో కలిసి వర్తించుట.

(3) అస్థిర వైరాగ్యము—ఇంట్లో కలహాముచే, దరిద్రము చేత, ఒంట్లో రోగముచే, బలహీనముచేత సన్న్యాసిగా యుండుట.

(4) ఔపాధిక వైరాగ్యము—అనగా భక్తి కలిగినప్పుడే వేషభాషల చూపి తక్కిన సమయలములో లేకుండుట.

(5) యథార్థవైరాగ్యము—అనగా పై జెప్పినవి మిథ్యయని నిశ్చయించుకొని, నిజమైన భక్తి జ్ఞాన వైరాగ్యములతో నుండుట.

## వైరాగ్య త్రయము

(1) పురాణవైరాగ్యము--అనగా భగవద్గీతాది వేదాంత గ్రంథములలోని మోక్షధర్మములను చదివినప్పుడే విరక్తి భావాతిశయము గలిగియుండి తాటాకు, వరిగడ్డి మంటవలె శమించిపోవుట.

(2) శ్మశానవైరాగ్యము—అనగా శ్మశానమునకు శవమును తీసికొనిపోవునపుడే మనముకూడా ధన ధాన్య బంధు మిత్ర పుత్రాదులను వదలిపెట్టి ఈ విధముగా ఒంటరిగా పోవ వలసినవారమేగదా! పుణ్యాపాప కర్మలుతప్ప జీవుని వెంట నేమియురాదుగదా! ఇకనుండి మనము దానధర్మాది పుణ్యాకర్మల చేయుచు వైరాగ్యముతో భగవంతుని భజించుట ముఖ్యాకర్తవ్య మనియు, వండినదంతా పొట్టకే, పెరిగినదంతా కాటికే యనియును తలంచి, వివేక వైరాగ్యములను నిలబెట్టుకొనలేక మరల దేహాభిమానముతో మమకారముతో లోభగుణముతో ఈ శరీరమే సంసారమే భోగములే శాశ్వతములను భావముతో వర్తించుట.

(3) ప్రసూతివైరాగ్యము—అనగా స్త్రీ ప్రసవవేదన పడునపుడు పురుషునితో కలియుటచేతనేగదా నాకీ బాధ సంభవించినదని తలంచి ఇకనుండి పురుషుని సంబంధమును పెట్టుకొనకూడదు యని నిశ్చయించుకొనియు కొన్ని దినములు గడచినతరువాత మరల కామసుఖమునకు లోబడుట యగును.

అనేకులు సంతాన మధికమగుచున్నదనియు, పోషించలేమనియును భయపడుచుండియు కామమునకు దాసు లగుచున్నారుగదా.

(1) దోషదృష్టివైరాగ్యము—అనగా దేహము, పుత్ర మిత్రాదిధనాదులున్ను అనిత్యములైనవనియు వీటిపైగల ప్రీతియే దుఃఖము కలుగుటకు కారణమగుచున్నదనియు, త్యజింపదగిన వనియును మాటిమాటికి దోషములను స్మరించుచుండుట యగును.

(2) స్వరూపవైరాగ్యము—అనగా అయిష్టముగా గోచరించుచున్న విషయములను వదలిపెట్టుట యగును.

(3) కార్యవైరాగ్యము—అనగా కక్కినకూటిని మరల స్వీకరించనట్లు వదలిపెట్టబడిన విషయములలోనికి జీవితములో మరల ఎన్నటికిన్ని ప్రవేశింపకుండుట (అనగా భక్తుడైన తరువాత భ్రాంతులలోనికి పోకుండుట, సన్న్యాసియై మరల సంసార విషయములలో అడుగుపెట్టకుండుట).

---

## మనోజయము కలవారెవరు ?

స్వస్వరూపాత్మయందే (తమలోతామే) యున్నవారై అత్యవసరమైనప్పుడుమాత్రమే మానసాదీంద్రియములను చలింపజేయువారు మనోజయము కలవారగుదురు.

ఈ దేహధనాది వస్తువులు నావి, ఈ బంధుమిత్రాదులు నావారు అను భావనలు నశించినవారే మనోజయము కలవారు.

నేను చేయుచున్నాను, నేను మాట్లాడుచున్నాను, నేను చూచుచున్నాను, నేను వినుచున్నాను, నేను వెళ్లుచున్నాను, నేను వచ్చుచున్నాను. అను భావములు లేనివారే మనోజయము కలవారు.

ఇది ఫలాని సంవత్సరము, ఇది ఫలాని మాసము, ఇది ఫలాని వారము, ఇది ఉదయము, ఇది మధ్యాహ్నము, ఇది సాయంత్రము అను భావముల చేయనివారే మనోజయము కలవారు.

ఇది ఫలానిదేశము, ఇది ఫలానిగ్రామము, ఇది ఫలాని వారి గృహము, ఇది ఫలానిజంతువు, ఇది ఫలానివస్తువు, ఇది ఫలానిమాట యను భేదదృష్టి లేనివారే మనోజయము కలవారు.

నన్ను గౌరవించుచున్నారు, నన్ను కొట్టుచున్నారు, నన్ను నిందించుచున్నారు, నాకు యిచ్చినారు, నా వస్తువులను తీసికొనిపోయినారు, నేను ధనవంతుడను, నేను దరిద్రుడను, నేను రోగిని, నేను ఆరోగ్యవంతుడను అను భేదభావములు, వికారగుణములు లేనివారే మనోజయము కలవారు.

నేను పండితుడను, నేను నిరక్షరకుక్షిని, నేను ఉద్యోగస్థుడను, నేను సంసారిని, నేను సన్న్యాసిని, నేను స్త్రీని, నేను పురుషుడను అను భావములు లేనివారే మనోజయము కలవారనబడుదురు.



## సారోపదేశములు

(1) మనస్సు మౌనముగా నుండుటయే మోక్షము.

(2) మనశ్చలనమే సంసారబంధము.

(3) మనోనిశ్చలతకు మించిన సుఖము త్రిలోకములందును లేదు.

(4) పాప ముండువరకును మనశ్చలన ముండును.

(5) మనశ్చలనము నశించినప్పుడే మన నిజస్వరూపము గోచరించును.

(6) మనస్సు నశించినవాడే మహావాక్యానుభవము కలవాడు.

(7) మనస్సునకు వేరుగా నామరూపప్రపంచము లేదు.

(8) మనో (దేహ) సుఖమునకు దాసులైనవారికి దైవ సుఖము కలుగదు.

(9) మనస్సునకు వేరుగా కామ క్రోధ సుఖ దుఃఖములు, శత్రుమిత్రాదులున్ను లేరు.

(10) మనశ్శాంతికి వేరుగా అమృతము లేదు.

(11) మనస్సున్నంతవరకును విధినిషేధములు (పుణ్యాపాపములు) ఉండును.

(12) కర్మ భక్తి యోగ జ్ఞానములు మనోనిగ్రహము కొరకే యేర్పడినవి.

(13) మనస్సును నిగ్రహించనిచో దేవునివల్లను, గురువు వల్లను మోక్షముకల్గదు.

(14) మనస్సులోనే దేవుడు, గురువును గలరు.

(15) మనస్సును నిగ్రహించుటయే మహాతపస్సు.

(16) మనోజయము కలవాడే ధీరుడు, శూరుడు, మహాత్ముడు నగును.

(17) మనస్సును దాటినప్పుడే దైవఋణము, గురుఋణమును తీరును.

(18) పూజ, నామసంకీర్తన, జప ధ్యాన సమాధులు, మహావాక్యవిచారణయు, మనోమయములే యగును.

(19) పంచకోశములు, జాగ్రత్స్వప్నసుషుప్తులు, సప్తావరణములు, బంధమోక్షములు, జీవేశ్వరజగత్తుల భేదములున్ను మనోవికారములోనే కలవు.

(20) మనస్సును (బుద్ధిని) దాటినచో మిగిలినదే స్వస్వరూపపరబ్రహ్మము.

(21) మనస్సునకు లోబడుచున్నంతవరకును శిష్యుడనబడును. మనస్సును స్వాధీనపరచుకొనిన మహానుభావుడే (తనమనస్సునకు గురువైనవాడే యితరులకును) గురువనబడును.

(22) చంచలమైన మనస్సును పూర్తిగా స్వాధీనపరచుకొని స్వస్వరూపానుభవము (పరబ్రహ్మానుభవము) నొందుటకు యమ నియమాదులు, సాధనచతుష్టయసంపత్తి, తత్త్వమస్యాది మహావాక్యవిచారణలున్ను సాధనము లగును.

(23) చెడ్డసంకల్పములు, దుఃఖములును వచ్చునపుడు పాపము అనుభవములోనికి వచ్చుచున్నదనియు, మంచిసంకల్పములు, సుఖములు వచ్చుచున్నప్పుడు పుణ్యము అనుభవములోనికి వచ్చుచున్నదనియును, పుణ్యపాపములు రెండును నశించినప్పుడే నిర్వికల్ప పరబ్రహ్మసాక్షాత్కారజ్ఞానము గలుగుననియును గ్రహించి తీవ్రముగా ననుష్ఠానము జేయుట ముముక్షువుల పరమధర్మము.

(24) ఇతరులు కోట్లకొలది ధనము నిచ్చినను సంతోషించకూడదు. వందలకొలది భక్తులు వచ్చి పాదపూజలు చేసి స్తోత్రములు చేసినను సంతోషించరాదు. గురువు మనదగ్గరకు వచ్చినను, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రత్యక్షమైనను సంతోషించ

కూడదు. ఇక దేనికి సంతోషపడవలె ననగా నిర్వికల్పము, నిర్వికారము నొందిన మనస్సునకే (పరమాత్మసుఖమునకే) సంతోష మొందవలెను. ఈ సంతోషమే శాశ్వతమైనది.

(25) మోక్షసుఖము నొందవలెనని తీవ్రతరమైన కాంక్షతో కోట్లకొలది పర్యాయములు మానసాదీంద్రియముల నిగ్రహము కొరకు ప్రయత్నములు చేసినమాత్రమే చివరకు మనస్సు పూర్తిగా స్వాధీనమగును.

నిత్యానిత్య వస్తువిచారణయు, మంత్రజపమును ఎడతెగక నిలుపుటయును, మనస్సుస్వాధీనమగుటకు సులభోపాయమగును.

(26) మాయతో మాయను ప్రేమించుట సంసార వ్యామోహ బంధమగును. మాయతో భగవంతుని, గురువును ప్రేమించుట భక్తియగును. మాయను వదలివేయుట జ్ఞానమగును, మోక్షమగును.

(27) మనోజయముగలవాడు మానవుడు గాడు. దేవుడే.

(28) దేహ మనిత్యమని నమ్ముట, దేహమును జ్ఞాన ధర్మములతో నడిపించుట, దేహములోని పరమాత్మను గాంచుట ఇదే శాస్త్రముల సారము.

(29) వేలకొలది గ్రంథములను చదివినను, కోట్లకొలది ధనమును సంపాదించినను, నూర్లకొలది మహాపుణ్యకార్యముల చేసినను, వేలకొలది మైళ్లు నడిచి తీర్థయాత్రల కావించినను, కోట్లకొలది భగవన్నామ జపము చేసినను, సర్వాత్మభావనయు సంకల్పరహితావస్థయున్ను కలుగనిచో, నిశ్శేష దుఃఖనివృత్తియును ఆనందప్రాప్తియును కలుగవు.

(30) పనులలో పాపముండరాదు. దృష్టిలో దోషముండ రాదు. ఇదే ముముక్షువుల ముఖ్య కర్తవ్యము.

(31) కర్మయోగముతో పుణ్యఫలప్రాప్తి, భక్తియోగ ముతో గురు దైవానుగ్రహ ప్రాప్తి, ధ్యానయోగముతో చిత్తైకాగ్రప్రాప్తి, జ్ఞానయోగముతో సర్వాత్మభావన, స్వరూపదర్శనప్రాప్తియు నొందబడును.

## సందేహత్రయము - సమాధానత్రయము

ప్రశ్న : స్వామీ లోకములో అనేక మత సాంప్రదాయస్థు లున్నారుగదా. వారిలో ఏమత సాంప్రదాయస్థులు గొప్ప వారు ? ఎవరు తక్కువవారు ?

ఉత్త : సోదరా, లోకములోగల అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత, వైష్ణవ, శైవ, శాక్తేయ, సౌర, గాణాపత్య, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయాది మతస్థులైనను, ఆంజనేయ, సాయి బాబాది ఉపాసనాపరులైనను, ఏ గురుసాంప్రదాయస్థులైనను, హింస, వ్యభిచార, దొంగతనాది చెడుపనులను చేయక అసత్య కపటాది చెడుమాటలు మాట్లాడక, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాది దుర్గుణములనుంచుకొనక వారివారి ఉపాసనా మార్గమును తప్పక యున్నచో, నదులన్నియు మహాసముద్ర ములో కలియునట్లు సచ్చిదానందపరబ్రహ్మమునే చివరకు అందరున్ను చేరుదురు. మనోవాక్కాయములలో ఏమాత్రము దోషములున్నను ఆ దోషములకు తగినంత దుఃఖము, భయము, అశాంతి, అపకీర్తియును తప్పక కలుగునను విషయమును ఎన్న

డున్ను మరువకుము. మంచివర్తనలు గలవారే గొప్పవారు. చెడువర్తన గలవారే తక్కువవారు.

ప్రశ్న : లోకములో కొందరు గృహస్థాశ్రమములో నుండియు జప ధ్యాన పారాయణ విచారణాది మోక్షసాధనల చేసికొనుచున్నారు. మరికొందరు బ్రహ్మచారులుగా యుండి గాని, తల్లి, తండ్రి, భార్యాబిడ్డలను వదలిపెట్టినచో, తల్లిదండ్రాదులు దుఃఖపడుచుందురుగదా. అపుడు వారిపాపము వీరిని చుట్టుకొని పతితులను చేయదా ?

ఉత్త : వారివారి సంస్కారము ననుసరించి ప్రవర్తనలుండును. బ్రహ్మచారులైనను ,గృహస్థులైనను, తల్లితండ్రిభార్యాబిడ్డలను వదలినవారైనను నిత్యస్వరూపుడైన పరమాత్మనునమ్మి అనిత్యస్వరూపములైన దేహధనాది నామరూప ప్రపంచముపై విరక్తి కలిగియుండి ప్రవర్తించినచో మోక్షసుఖము నొందవచ్చును. ఆచరణయే గొప్పదిగాని సామాన్యక్రియలు, ఆశ్రమభేదములున్ను ప్రధానములు కావు.

తల్లిదండ్రిభార్యాబిడ్డలను వదలిపెట్టకూడదనియు, పాపమనియును తలంపులుగలవారు వదలిపెట్టరు. వదలరాదుకూడ.

తల్లిదండ్రాదులను పోషించుచు ఇంటివద్దర నుండుటకంటె వారిని త్యజించి తపస్సు చేసికొనుటయే చాలగొప్పదను నిశ్చయముతో సందేహరహితులై యుండువారు సంసారములో నుండరు. ఉండనవసరము లేదుకూడ.

శ్రీబుద్ధునివలె, శ్రీరామానుజాచార్యునివలె, శ్రీరామతీర్థస్వామివలె, తల్లితండ్రి భార్యాబిడ్డలను వదలి విశ్వమునే స్వంత

కుటుంబముగా, స్వగృహముగా భావించి, తపస్సు చేసికొనుచున్నచో, ఆ విశాలహృదయుల దోషములన్నియు నశించి, అఖండ బ్రహ్మజ్ఞానులు కాగలరు. తపస్సు (అనుష్ఠానమును) సరిగాచేయనిచో తల్లిదండ్రి భార్యాబిడ్డలను వదలిన దోషము తప్పక పట్టుకొని పతితులనుగాజేయును. నరకదుఃఖము కలిగించును.

ప్రశ్న : లోకములో కొందరు సిద్ధులు మహిమలను చూపుచున్నారు. జగత్తుమిథ్యయని వేదాంతము చెప్పుచున్నప్పుడు మహిమలుకూడ మిథ్యయేగదా! అట్టిచో, కొందరు మహానీయులని అవతారమూర్తులనియు పిలువబడువారుకూడ మిథ్యాసిద్ధులను చూపుచున్నారే! మిథ్యాప్రదర్శనలు చేయువారు మహానీయులు అవతారపురుషులనియు ఎట్లు చెప్పచెల్లును ?

ఉత్త : లోకములోగల మహానీయులు వారివారి ప్రారబ్ధానుసారముగాగాని, ఈశ్వరసంకల్పానుసారముగాగాని, లోకకళ్యాణముచేకూర్చవలెనను కరుణామృతదృష్టితోగాని ప్రవర్తించుచుందురు.

లోకజనులకు పరమభక్తులు, బ్రహ్మజ్ఞానులు, యోగులు, మహిమలను చూపించే మహానీయులు, అవతారపురుషులున్ను అత్యవసరమే యగును.

పూర్వకాలమునుండియు ఈలోకములో మహిమలను చూపించే మహాత్ములు కూడ అవతరించుచునే యున్నారు.

వసిష్ఠుడు, పరాశరుడు, విశ్వామిత్రుడు, శంకరాచార్యులు, రామానుజాచార్యులు, బ్రహ్మంగారు, సిద్ధయ్యగారు, జ్ఞానదేవుడు,

మాణిక్యప్రభువు, రామాలింగస్వామి, శ్రీసిద్ధారూఢస్వామి, ఏసు క్రీస్తు మొదలగు పూర్వపు మహనీయులేగాక నేడు శ్రీ సత్యసాయి భగవానులు అనేక మహిమలను చూపి నాస్తికులను ఆస్తికులనుగా, పామరులను భక్తులనుగా, మార్చి వేయుచున్నారుగదా!

సాత్త్విక మహిమలనియు, రాజసిక మహిమలనియు, తామసిక మహిమలనియు, మహిమలుమూడు తరగతులుగా నుండును. వాటివివరములను ఇచట వ్రాసినచో పెద్దవ్యాసమగునని వదలిపెట్టడమైనది. సాత్త్వికసిద్ధులనే మహాత్ములు గలిగియుందురు.

ఈ వైజ్ఞానిక ( సైన్సు ) యుగములో మహిమలను కూడ చూపే మహనీయులు లేనిచో లోకములో నాస్తిక మతము ప్రబలమగును. మిథ్యా మహిమల వలననే మిథ్యా గుణములు నశించి మహాత్ములయందు, ధర్మాచరణయందు, సత్యస్వరూపమైన పరమాత్మయందును విశ్వాస మేర్పడును. కనుక కలలోకూడ మహాత్ములను దూషించరాదు. విమర్శించరాదు.

మహిమల జూపని మహాత్ములు లోకములో బ్రహ్మజ్ఞాన ధర్మములను వృద్ధిజేయుదురు. మహిమలు గల మహాత్ములు ముఖ్యముగా దేహ బాధలను, నాస్తిక భావములను, నివారింపజేయుదురు.



## మోక్షసారము

మమకార(మోహ) మున్న వారికి త్యాగగుణ ముండదు.

త్యాగములేనివారికి పుణ్యము కలుగదు.

పుణ్యములేనివారికి భక్తి కలుగదు.

భక్తిలేనివారికి వైరాగ్యము కలుగదు.

వైరాగ్యము లేనివారికి ఇంద్రియనిగ్రహము కలుగదు.

ఇంద్రియములను నిగ్రహించనివారికి గుణములు నశించవు.

గుణములు నశించనివారికి పరమాత్మధ్యాననిష్ఠ కుదరదు.

పరమాత్మధ్యానము కుదరనివారికి బుద్ధి విశాలము కానేరదు.

బుద్ధి విశాలముకానివారికి అహంకారము నశించదు.

అహంకారము నశించనివారికి ఆత్మానుభవము స్థిరము కాదు.

ఆత్మానుభూతి స్థిరముకానివారికి దుఃఖము (అనగా రాగము, ద్వేషము, భయము) నశించదు. దుఃఖము నశించని వారికి ఆనందము ప్రాప్తించదు.

ఆనందము సిద్ధించనివారికి జన్మరాహిత్యపదవి లభించదు.

జన్మరాహిత్యపదవి లభించువరకును దానము, ధర్మము, తీర్థసేవ, దైవసేవ, పెద్దలసేవ, సత్సాంగత్యము, భగవన్నామ సంకీర్తన, సద్గ్రంథపఠన, జపము, తపము, వ్రతము, ధ్యానము, విచారణ, సమాధి, నిష్ఠ మొదలైన సత్కర్మలను మనోవాక్కాయములతో చేయుచునే యుండవలయును.

## నిత్యాచరణ – భవరోగనివారిణి

(ఔషధము)

భగవత్పూజ, భగవన్నామసంకీర్తన, నామస్మరణ, ధ్యానముల జేయుట.

(పథ్యము)

కోరికలను, క్రోధము, ద్వేషముఅసూయ, స్వార్థము, భయము, కపటము, అహంకారములను వదలుట.

(అనుపానము)

దానము, పెద్దలకు, వృద్ధులకు, దీనులకును సేవచేయుట, సద్గ్రంథ పఠన, పుణ్యస్థల తీర్థదర్శనము, ఉపవాసము, మౌనవ్రతములు ఏకాంతస్థలనివాసము, బంధమోక్షముల విచారణలు సలుపుట.

(ఆరోగ్యఫలము)

దుర్గుణములు నశించుట, మానసాదింద్రియములు స్వాధీనమగుట. నిరాకార, నిర్వికల్ప, నిర్గుణ, అఖండ సచ్చిదానందానుభూతి కలుగుట

## గృహస్థు లెట్లు నడువవలెను ?

గృహస్థులారా, ఇంద్రియ విషయభోగములను అనుభవించుటకొరకే పెండ్లి చేసికొనక, కర్మదోషము నశించుటకొరకు, ఆత్మజ్ఞానమును సంపాదించుకొనుటకును ప్రయత్నము చేయుటకే వివాహము చేసికొనవలెను.

